శ్రీరస్తు

# బంగన్ బకావలి

అను

## భువనమోహిని

( అయిదంకముల నాటకము )

ఇది

శ్రీయుత అయినాపురపు సుందరరామయ్య గారిచే

రచియింపఁబడి

శ్రీయుత గెలకంటి వేంకట భావనారాయణరావు గారిచే

ప్రకటింపఁబడినది.

---

మొదటికూర్పు

---



రామవరమున

శ్రీ మేరీముద్రాలయమునందు మల్లాడి సత్తిరెడ్డి గారిచే

ముద్రింపఁబడియె.

**1925**



వెల రు 1-0-0

## —: ఇందలి పాత్రలు :—



రాణా ఆనంద దేవుఁడు—బంగాళా చక్రవర్తి

రాణా అమీరు—మంత్రి



రాణా సదానంద దేవుఁడు—కథానాయకుఁడు - ఆనంద దేవునికుమారుఁడు

పండిత మదనమోహన్—జ్యోసి

జేపాలుఁడు—మంత్రగాడు

రాణా జగదేక దేవుఁడు—నాగపుర ప్రభువు—మోహిని తండ్రి

దేవీ పాదుషా—బన్న హాపల్లెన వాలు—బకావలి తండ్రి

ఇంద్రుఁడు—స్వర్గాధిపతి



## —: స్త్రీలు :—

రాణి జగన్మోహిని—కథానాయకుని భార్య

నంద, సునంద, నందిని—జగన్మోహిని చెలికత్తెలు

వినోదవలి—సదానందుని వేడుక దాసి

మాయామోహిని—జేపాలుని కూఁతురు—కట్టు పోతుది

మహిళ—మాయామోహిని చెలికత్తె

కృత్రిమ బకావలి—

మోహిని—జగదేక దేవుని కూఁతురు

బకావలి—కథానాయిక

1, 2, 3, 4 చెలికత్తెలు ప్రవేశము

శ్రీరస్తు

శుభమస్తు — అవిఘ్నమస్తు

# బంగన్ బకావలి



## నాంది — ప్రస్తావన

మ. శ్రోతలు మీరి తేరియులు కూలెను మాతిప, కౌఁగిలింపనా
జోలికిరాకు మద్దికవ ♦ సోతె ధరాస్థలి, గోటు చెమ్మటన్
జీలమువెగ హిరణ్యకశి ♦ పే భయమయ్యె నటంచు వాడు రా
ధాలపనంబు ముగ్గురకు ♦ తత్పరతన్ జుబుకంబునంటు గో
పాలుఁడు ? కృపాలుఁడు కృ ♦ పామతి సభ్యులకిచ్చు గౌటుకల్

[ నాంద్యంతమున నటి సూత్రధారులు ప్రవేశింతురు ]

నటి — ఆర్యా! మీ రిప్పుడు ప్రదర్శింపఁబోవు నాటకమేది?

సూత్ర — అది బంగన్ బకావలీ యను నాటకరాజము

నటి — (ఆశ్చర్యముతో) ఆర్యపుత్రా! "గుల్బకావలి హసన్ బకావలి" గాక "బంగన్ బకావలి" యను నాటకరాజ మొకటి వెలువడినదా?

సూత్ర — అవును. ఏమీ? ఆశ్చర్యపడుచుంటివి?

నటి — ఆశ్చర్యమా? మరియాశ్చర్యమా?

సూత్ర — ఎందులకీ యాశ్చర్యము?

నటి — ఎందులకంటిరా!

ఉ. ఆరయ గుల్బసంపదను బ ♦ కావలినాటకముల్ రచించి శృం
గారరసంబుగుప్పి కళఁ ♦ గట్టఁగఁజేసి యశంబునొందె యం
చోరచనేక ప్రాసిరిగ ♦ సుందరరామయపైకిఁ బోటిగం
చారహియిట్టు బంగనబ ♦ కావలియంచును వ్రాయఁబడ్డెడున్

సూత్ర — ఏమీ! ఇతరకవులు మాత్ర మంత శృంగారరసమును జొరబెట్టలేరా? శృంగార కవనక వారికే పుట్టినదా!

శ్రీరస్తు

# బంగన్ బకావలి



అను

## భువనమోహిని

## ప్రథమాంకము



### ప్రథమరంగము — ఆనందదేవుని సభ

[ ఆనందదేవుఁడు, అమీరు గను మంత్రిశేఖరుఁడు, పండితోత్తముఁడు
మోహాన్ అను వ్యక్తితో నున్నతాసనముల పై ప్రవేశింతురు.]

ఆనం — పండిత పుంగవా, మంత్రివర్యా! మత్పుత్రుఁడగు సదానందదేవున కిప్పుడు పదునెన్మిదవ యేఁడు గతించినది. ఇఁక రాజ్య భారము నాతని భుజాభాగమున మోపి నాకు విశ్రాంతి నొందవలె నని తాత్పర్యమున్నది. అందుల కాతని జాతకము తాము పరిశీలించి రాజ్యభారమును పూనుటకుఁ దగిన లగ్న మేర్పాటు చేయుఁ గోరెదను.

పండి — చిత్తము. అటుల విశ్రాంతిఁ జెందుట శాస్త్రధర్మమే కదా.

అమీ — పండితవర్యా! శాస్త్రధర్మమనుచుంటిరే. అటులనుటకుఁ గారణమేమి?

పండి — అమాత్యవరా! పుట్టినది మొదలు గిట్టువరకు సంసారసాగరంబున బడి దరిగానక మితిలేని పాపమార్జించెడి జీవికి విశ్రాంతి యెప్పుడు? ముందు పరసౌఖ్యమనుభవింపదగిన భగవంతుని యాంతరంగిక చింత యెప్పుడు? అవి లేకుండిన తిరుగ మంచి జన్మము కలుగుటెట్లు? అన్యాది విచారించి శాస్త్రజ్ఞులు జీవిత మీక్రింది తీరుగా విభజించిరి.

కం. మనుజునకు బ్రహ్మచర్యం, బని గార్హాపత్యమనియును ♦ వానప్రస్థం
బని సన్యాసంబనియూ, యనువుగ విభజించె వారలు ♦ నాశ్రమములుగాన్

బ్రహ్మచారియై బ్రహ్మచర్యాశ్రమము గొనినయప్పుడు విద్యాగరిష్ఠుండై స్నాన సంధ్యాదిక్రియ లాచరించుచు గ్రిందబరుండుచు స్త్రీసంపర్కమనునది లేక మెలంగవలెను. రెండవది గార్హాపత్యము. అనఁగా గృహస్థాశ్రమము. ఇందులో ధర్మార్థ కామ తృప్తుండు కావలె. తప్పనిగా ధనమార్జించుట, అతిథి నభ్యాగతుల నాదరించుట, తనభార్యయందు మన్మథక్రీడలచే గామభోగ్య పరితృప్తుండగుట. మూఁడవది వానప్రస్థము. అరణ్యనివసించ

త్వరములు పడును చెల్లినపిమ్మట సంసారబాధ్యతనంతయు దనపుత్రులకు నొప్పగించి తాను వనంబులకేగి శరీరమును కందమూలములయందు పోషించుచు దపమ్ము దదేకనిష్ఠతో భగవంతునిగూర్చి తపించుట. నాల్గవది సన్న్యాసము. దేశాటన మొనర్చుచు నిలచిన యూరను నిలువకుండగా వేళకొక గృహస్థుని యింటికేగి యచట కొంత గంగామృతము గొని వెడలిపోవుట. ఇందు నొకటిఁ మూఁడు నాలుగాశ్రమములవల్ల బాగుగా పుణ్య మార్జించి ముక్తిమార్గము నొందవగు. వివేకియైనవాఁ గృహస్థాశ్రమమందు కూడ వానప్రస్థుఁడై సంచరించిన నందును బుణ్యమును బడయువగును.

అమా—చిత్రము. ఇప్పుడు మా యువరాజుగారికి భార్య గాపురమునకువచ్చి యుండుటచే గృహస్థాశ్రమము మా రాజుగారు వృద్ధులగుటచే సన్న్యాసాశ్రమము సైతా నవెంచిరి. ఇదిగో జాతకము. (అని యొక కాగితము నొసంగి) గ్రహస్ఫుటము చేసి రాజ్యాభిషేకమునకు మంచి ముహూర్తము తెగినంత త్వరలోఁ గుదుర్చుఁడు.

పండి—(కాగితమును చూచి) ఆహా జాతకమయినచో అఖండ సామ్రాజ్యలక్ష్మీ విభవ మనుభవించెడి జాతకమే. (పెదవులు విఱచుచు) ఇప్పుడేమి లాభము.

అవం—అది యేమి మహాత్మా! పెదవులు విఱచుచు మాటచెప్పుటకు సంకోచిం చుచుంటిరే, ఆయుర్భాగ్యము కలదా లేదా?

పండి—ఆయుష్యు యూంగులకు సందియము లేదు, కలియుగప్రమాణము ప్రకారము సహస్రమాసజీవియే.

అమా—రాజ్యాప్తి లేదా యేమి?

పండి—అందులకంతకంటె సందియము లేదు. దేవలోక బంగాళమునకే యధిపతులు కాని యీతఁడు మూఁడురాష్ట్రములకు ప్రభువు.

అవం—అయినచోఁ దామందులకుఁ బెదవి విఱచిరి.

పండి—ఒకసంవత్సరము లోగా నీతనికి రాజ్యాధిపత్యము లేదు.

అమా—ఎందువలన?

పండి—ఈ జాతకునకు లగ్నమందు చంద్రుఁడు కలడు. గురువుపదింట కలడు. గురాంతర్దశలో నీతనికిఁ బరిణయమైనది. పాపుడగుశని గురునకు శత్రుస్థానమందు నిలిచియుండుటచే నీతఁడు రేపటెల్లుండిలో నిలువెడలి దేశాటనము ప్రారంభించును. గురుఁడు శుభగ్రహమగుటచే నీవిపత్తు రానివయుండఁ గాపాడి శుభములనుప్రసాదించును.

చ. ఇతఁడొక జీవి మాట విని ♦ యేర్పడిపోవి వనంబుఁ జొచ్చి పె
న్వెతలను బొంది వెక్కరతె ♦ నె తిరుగాడఁగఁ గట్టుఁబోతుఁడౌ
యతివకుఁ జిక్కి–యేర్పడి మ ♦ హాత్ముఁడనుగ్రహశక్తిచేత వి
ద్యాధులకు కలదా యెదను ♦ గొన్నలరుప్పలఁ బెండ్లియాడుగా

ఈతని కిప్పటిభార్యతోఁ గలసి ముప్పదుభార్యలు లభించునట్లుగానే మీరాజ్యముతోఁ గలసి మూఁడురాజ్యములు లభించును. అతఁడుపొందుకష్టములు వర్ణనాతీతములు. ఇది యీతని జాతకఫలము. అంతవఱకు మీరలోపిక పట్టవలెనే గాని యీలోగా రాజ్యాభిషిక్తుని చేయఁదలంచినను లాభము లేదు. అందులకై పెదవివిఱచితిని.

అనం—సరే. ఇదియు నొకవిధమైనసంతోషమే. ఎన్ని గష్టము లొందిన నేమి క్రియను బూర్ణాయుష్మంతుఁడై రాజ్యభాగము పూనునుగదా.

అమా—ఆదుర్భాగ్యముఁగల జాతకున కాపద లష్టవు. ఎట్లంటిరా?

శా. తోయంబందున నెట్ట నీనగముపై ♦ దొర్లింప నీవ్యాఘ్రముల్
పాయంజాలక జంపఁబోటుఁబడ నీ ♦ జ్వాలాగ్నిలోమాఁడ నీ
ప్రాయగ్రంబుగనివ్వనీవిషము స ♦ ర్పంబుల్ మెయింజుట్టనీ
ఆదుర్భాగ్యము కల్గుజాతకున కా ♦ హా యంటునే మిత్తియున్

కావున పూర్ణాయుష్మంతుఁ డగుఁ దమపుత్రుని యిక్కట్టులకు విచారింపకుఁడు. ఇంతియును వాతఁ డొందు ఇబ్బంది యొక వత్సరము.

పండి—అంతియే

అనం—అయినచో నిప్పుడు యత్నించవలదందురా?

పండి—ఏమిలాభము.

అనం—అమాత్యపుంగవా! వీరిని సత్కరించి పంపివేయుము.

అమా—చిత్తము. (యవనికజారును)

---

## ద్వితీయరంగము

---

రాణి జగన్మోహిని మందిరము

[ ప్రవేశము జగన్మోహిని యభ్యంగన మాచరించుకొనినపిదప నిలువుటద్దమున కెదురుగా ముత్యాలకుర్చిపై నగలను ధరించుకొనుచు కూర్చుండును. ప్రక్కను నంద, నందిని, సునందనలు నిలువంబడి యుందురు. ]

జగ—(పూర్తిగ మస్తీబయి) చెలికత్తియలారా! చూచితిరే నాయందము నా డెందమునే యాకర్షింపఁ జేయుచున్నది.

ఉ. ముంగురు లుంగరాల్ నొసట ♦ ముద్దుగ వాడ, వళుల్ కురుల్ నిరం
బాంగముపై నటింప, నతి ♦ పల్చన చెక్కులకాంతి పొమ్మనన్

[ ప్రవేశము — సదానందుఁడు ]

సదా — చెలీ! తొందరసెందకుము

జగ — దేవా! నన్ను వారింపకుము

వినో — మహాత్మా! మీజాయ నడ్డకుఁడు

కంప, సునం, నంది — (స్వగతముగ) మనమిట నిల్వరాదు (నిష్క్రమింతురు)

సదా — హేచ్చెలీ! జగన్మోహినీ! కారణము వచింపుము

జగ — కారణమా! నీదకాంతకు దాము చనువిచ్చుటయే

సదా — నిక్కమైన నవమానించినదాయేమి?

జగ — నాయుద్దేశము ననుసరించి జవా బివ్వక పోవడమే యవమానించుట

చాను — మహాత్మా! జన్మించినదాది నేటి కిరువది వత్సరములు ఎటు కన్నులఁ బెట్టిరో యెఱుంగను. నేడు మీసంస్థానము జేరి నేర్చుకొనవలసి యున్నది

సదా — నీయుద్దేశమేమిటి? నీకన్యథా చరించినదేమి?

జగ — నాకంటె యీపదునాల్గు భువనంబులయందున నందకత్తెం లేరని

సదా — ఏమే? వినోదవల్లీ! నీయభిప్రాయము?

వినో — దేవా!

కం. సకలచరాచరకోటిని, యకలంకముగా సృజించె ♦ డాదిత్యుండా
యొక భగవానుండు వినా, యొకరొకరు మించుటకల ♦ దొయ్యారములోన్

సదా — నిశ్చయమే. చెలీ! మోహినీ! నీవును నందులకుఁ గట్టుబడ వలసినదే. ఏమంటివా? పరబ్రహ్మమూర్తికి యాకారమేమిటని? అతఁ డన్ని యాకారములయందును నిమిడియున్నవాఁడు. అనఁగా నేయాకారమును పొందవలెనన్న నాయాకార మొందఁ గలఁడు. అతఁ డుండని వస్తువేలేదు. కాఁబట్టి యమ్మహాత్ముఁడు తక్క వానిని సతి యగు మహాలక్ష్మి తక్క మీయువరాణికంటె సొగసైన మగువలను వచింపఁగలవా?

జగ — వినోదవల్లీ! వచింపకున్న నీశిరము నీశరీరమునుండి తెగి క్రింద బడిన దనుకొమ్ము.

వినో — అమ్మా! నాకది మహానందపదవియే. ఎందులకంటివా? యువరాజా! నే నా యువతియుండినతావలం భేటిగించి నామె సౌందర్యమును గూర్చి వర్ణించి నహోఁ జిలుకయు గోరువంకలాగున నన్యోన్యమైత్రితో మెలంగు మీ యాలుమొగల మధ్య నెడఁబాటు కలిగించినదాన నగుదును. అట్టి ఘోరపాపమున కొడిగట్టుటకంటె నాకుత్తుకదెగి భూమిపైఁ బడినఁ బడుఁగాక. ఇంక నా ప్రశంస నన్నడుగవలదు. నే నెఱవలము. మీకు వేయివందనములు

జగ—అబ్బో! యీతప్పెట్టులకేమి?

సదా—మాట బహు చక్కగా టంకపుపాడిలాగున అతికినది.

జగ—దానిపేరే వినోదవల్లి, కాలక్షేపార్థము దానిని యింద్రుఁడు మీకొసఁగి యున్నవాఁడు. కల్లబొల్లి కథలతో గాలము పుచ్చుచున్నయది. అంతియేకాని నిజమేమిటియో దానికేకాదు దానిఁ బంపిన స్వర్గనాయకునకుఁ గూడా తెలియదు. వినోదవల్లీ! నిజమాడుదానవే యైన నాకంటె యందకత్తెలను నీత్రిలోకములలోను బదిమందిని జేర్కొనుము పోనిమ్ము పదిమంది కాకున్న నైదుగురు. పోనీముగ్వురు. అది కాదంటివా యొక్కతెను దెల్పుము.

వినో—నేను దైవముఖము జూచి సందేహించుచుంటిని. నీవు ముందువెనుక లెంచక నన్ను నిందించిన నిందింతువుగాక. యదార్థము వచించిన ముందు నీభర్త నిన్ను విడనాడుట పిమ్మట యటవీస్థలి చోరంబడుట కలుగును.

సదా—వేట నిమిత్త మటవులు సంచరించు మాకా యటవిభయము?

జగ—ఏమీ? యీవగలమాటలు. నీవేదియో యొకానొక బోటిని నీటుకత్తె యని వర్ణించినంత మాత్రమున ప్రాణపదమైన నన్నును నతి గారాముగా పెంచిన తల్లిదండ్రులను, స్వర్గతుల్యమగు రాజ్యము త్యజించి వెఱ్ఱివానివలె ఘోరాటవుల ద్రిమ్మరు ననుకొంటివా?

వినో—(తలపంకించి) ఏమీ? నీభర్త యంత మనసు కట్టుబాటుకలవాఁడా యేమి? ఆకన్యను సృజించిన సృష్టికర్తకూడా యొకానొకప్పుడు నేనా యావాల్గంటిని సృజించితిని యని తన నాశికముపై వ్రేలిడుకొనుచుండును.

సదా—ఏమీ? యూరించి యుబ్బించి చంపుచుంటివి. సవిస్తరముగా నాయువతి యెవ్వతియో యెక్కడనున్నదో దాని చారిత్రమంతయుఁ బూసగ్రుచ్చిన పగిదిఁ దెల్పెదవా? లేక మాజగన్మోహిని చేయఁదలంచిన యకృత్యమే నొనర్చవా?

వినో—మహాత్మా! ఇందు నాతప్పులేదు. అమ్మా? యువరాణి! యిఁక నన్ను పాపమంటదు. యువరాజా! నయభయములచే నన్ను బెదిరించుచుంటివి. ఈనిమిషము మొదలు మీమనస్సు మహాగందరగోళ మను సాగరమున మునింగినది యనుకొందు. నేనేమిచేయుదును.

తే. గీ. వినుఁ డదృష్టమవెంఁడి చోకా ♦ చినిఁగివేని
యిలను నాలోచన మదెంచి ♦ చెలఁగుసూది
తప్పుతీయఁగ జాలదు ♦ రాజవర్య
యెన్నివత్సరములకైన ♦ నేమనందు

సదా—దైవనిర్ణీతమును దాఁటుట మన తరమా? ఏదీ త్వరగా వచింపుము.

జగ—(స్వగతమున) ఆహా! భర్తయొక్క ముఖవర్చస్సును వీక్షింప కామాంధకారములో నాతని హృదిచొఱఁబడినట్లులు తోఁచుచున్నయది.

వినో—(స్వగతమున) మన మెందులకు దాచవలెను? ఇంద్రుఁడు నన్నెందుల కీసుందరాంగుని కడకుబంపినది. సమయము వచ్చినప్పుడు బన్గన్ బకావలీకథ యేకరువు పెట్ట వలయుఁగదా? ఇఁక నాలోచన యేమిటి? (ప్రకాశముగా) దేవా వినుండు:—

చ. కలదిల దత్తమండలము ♦ కర్నులసీమ ప్రదేశమంతరున్
గలితపు రాజధాని బన ♦ గానపడి బన్గనపల్లె బంగి నం
బలరఁడి నామముల్ కలిగి ♦ యాకసమంటుచు హర్మ్యరాజిచే
జెలఁగుచు సుందరాంగులకు ♦ స్త్రీపురుషావళి కాస్పదంబయా.

కడప, కర్నూలు, బళ్లారి. యనంతపురం బను నాలుగు జిల్లాలకు దత్తమండల మని నామము కలదు. అందులో కర్నూలను జిల్లాకు బన్గనా, బన్గనాపల్లె బంగిన్ అను నామములతో వెలసిన రాజధాని యున్నది. దానిని పాలించు మహమ్మదీయ ప్రభువునకు బన్గన్ అను "దేవీపాదుషానవాబు" అని పేరు. అతని పాలన చమత్కారమేమియో యందలి యేప్రాణికిని విచార మనునదిలేదు ఆ ప్రభువుయొక్క కాంతి నుండియే సూర్యచంద్రులు కొంద్దిప్రకాశమును సంపాదించుకొని దానివలన ప్రపంచమునకు నఖండతేజ మొసఁగుచు ప్రజల కానందమును గూర్చుచుఁ దమకంటె తేజోవంతులు లేరనే భాస్కర, ప్రభాకర భాస్వంత యను నామములచే సూర్యుఁడును శుభ్రాంశువు, కళానిధి యను పేర్లచేఁ జంద్రుఁడును బరగుచున్నవారు. ఆనవాబు గోలకొండ నవాబు తెలుంగున హిందూమతమునం దతిభక్తిఁగలవాఁడు. ఈశ్వరభక్తుఁడు. బ్రాహ్మణులచేత నిత్యము సహస్రలింగార్చన జేయించుటలో శివునకుఁ బ్రీతియగు బకపుష్పములచే నారాధనచేయించి యాతీర్థము స్వీకరించినపిదప తాను భుజించుటయు సదాచారమున రాజకీయవ్యవహారము లొనర్చుటయుఁ గలదు. అతనిభక్తికి మెచ్చి "బకావలి" యనుకుమార్తె నొసంగెను. అనఁగా బకః + ఆవలీతి బకః నాగలింగంధవసౌ, పరిమళించునటువంటి, ఆవలి=సమూహము కలది అనగా మిక్కిలి సువాసనల దేహముకలదని యర్థము "బకోవసుః" అని యనుకము. ఈబకపుష్పమునకే వసుపుష్పమని పేరు. వసుః=అనగా బంగారము. బంగారమువంటి శరీరఛాయ గలిగి మిగులపరిమళించు ముద్దతో నిర్మింపఁ బడినదని భావము. అనగా పరిమళయుతమైన బంగారు బొమ్మయనుకొనుండు. ఆమె "బన్గన్" నవాబు కూఁతురుగాన బన్గన్ బకావలి యని పిలుతురు. అందరిని మోహింప

దగినంత రూపలావణ్యములు కలదియగుటచే "భువనమోహిని" యని నామాంతరము గలదు. దానిని వర్ణించుటకు వేయిజిహ్వలుగల నాగేంద్రునకుఁ గూడ తరముకాదు. బృహస్పతివంటి దేవగురునికైనను పాండిత్యము చాలదు. కాని చెప్పవలసివచ్చినది గాన నాయల్ప పాండిత్యముచే వర్ణించుచుంటిని. కాని నావర్ణనకు వేయిరెట్లధికముగా మీరా యువతి సుందరం బెంచుకొనుండు.

ఉ. అప్పుడు వెండిపై బులుగ ♦ గాచిన బంగరుసేయుతీరు వ
న్నెన్పగు మేనికాంతి, సుమ ♦ మాలిని ముట్టు ప్రకాశమిచ్చెగా,
స్వచ్ఛముగా గనంబడును ♦ పావనమౌనట్లుగ గంతమందు నం
దచ్చుగ నీరుగ్రోల, యిఁక ♦ నాచిలుకేడగ హాయిసనందురో

ఓ దేవా! మరియును.

ఉ. వన్నెనయేని బల్లరిస ♦ నాటపు కాంతి, నిగారిన్ని
మవ్వపుచెక్కులందోయి జిగి, ♦ మాటుగ కంచెంచింపు కెవ్వలం
జన్నెనదూఁకె పట్టుల కే ♦ వంబను చామలరిగ్గ, వల్లనుం
డివ్వెలగుల్ ప్రకాశమిడె ♦ డింపగులో దొడలు న్నగ్గు, లి
ల్లెన్వభిమాద్యతుల్ దనర ♦ గన్పడు దద్యుతిఁ దీపమాలలన్

ఇత్యాది మేని సౌందర్యము. ఇఁక నామె ముస్తీబంటిరా వినుండు.

సీ. నవరత్నయుతములై ♦ హవణిల్లు మేల్పుగా, శిరముపై వేవేళ ♦ వరలుచుండు
రత్నస్థగితమగు ♦ రహింక బైనంకీలు, భుజకీర్తులట్టీల ♦ పొరయుచుండు
తవకంటొయారిచే ♦ దనుగతి గానిన, పతకముల్ గళమున ♦ ప్రబలుచుండు
దానకంకణములు ♦ దాల్చిన గతిచేత, బచ్చెంకటకణాల్ ♦ బరగుచుండు

తే. గీ. నేలఁజీరాడు విధమున ♦ మేలిపట్టు
సన్నని తెల్లపులంగాగ ♦ జక్కఁబూని
నీరువంటి కండువపైట ♦ నెరిగఁదాల్చి
మబ్బురంగగు జాకెట్టు ♦ మమతఁబూను

ఆయమ నవాబు గారాబుపుత్రికయగుటచేఁ గ్రిందివడచి యెఱుంగదు. మెత్తని తివాసీలపై నడచును. నడచునప్పు డామె లంగా పాదములను గప్పి నేలపై రెండు మూఁడు గజములవఱకు బొడవుండుటచే నాలంగాను బట్టుకొని యామెతోడ నడచు దాసీజనంబుల సంగతి వినుండు.

చ. ఇలజలపోఁత పోసినటు ♦ లింపగు మేఁగలతోత్తు లేడువం
దలు, పటకాలు జత్తురవి ♦ తాళిచినద్యుమ్రము, కేలకంకణా
ఘులుఘుల్ మ్రోవ, గజ్జియలు ♦ కాళ్లధ్వనింప బకావళీదరిన్
నిలచెద రెప్పుడేమి పని ♦ నేర్చునొ సల్ప తయూరుచిత్తునై

చ. చెప్పఁగనేల నావరపు ♦ చేడియ యుందరి మోయారవహాసహేల్
తప్పినవాసనన్ మెయి ము ♦ ఖాబ్జవికాసము గాంచి నేని నే
నొప్పఁగ నందకత్తైనని ♦ యుట్టిటులాఁగెడి నీదుభార్యతా
జప్పునసిగ్గుచే మునిఁగి ♦ జచ్చును దోసెడు నీటియందునన్

జగ—(స్వగతమున) ఓహో! నాగర్వము నన్నే యణచివైచినది. భర్తయొక్క ముఖవైఖరి విలోకింపఁగా బకావళిపైకి మనస్సు పోయినట్టు గన్పట్టుచున్నయది. (ప్రకాశముగా) ప్రాణేశా! మాటలపాటవముఁగల నాబోటు నన్నవలకేమి రండు శయ్యాగృహమునకు విశ్రాంతికై వెడలుదము. వినోదవల్లీ! ఇంకాప్రశంస గట్టిపెట్టుము.

వినో—అంతయు నీచిత్తమే నా?

సదా—(విసుగుదలతో) సఖీ! నీకు విసుగుగానుండిన నీవు వెడలుము. నేను శాంతముగా వినివచ్చెద.

జగ—(సిగ్గుచేఁ దలవంచుకొని వెడలును)

వినో—దేవా! త్రిలోక సుందరాంగులని పేరువడసిన రంభ, యూర్వశి, మేనక ఘృతాచి, తిలోత్తమాది యప్సర మత్తకాశినులను నిత్యము గాంచుచు నింద్రుఁ డా చంద్రానన సౌందర్యమునకు చిత్తవిభ్రమము నొంది యామె ఛాయాపటమును దేవశిల్పి యగు విశ్వకర్మచే వ్రాయించి యుంచినవాఁడు. సెలవైనచో మీ యేకాంతమందిరంబున గుప్తపఱచి యుంచితిని నచట కేతెంతురేని దానినిఁ జూపఁగలెద.

సదా—అటులైన మరిమంచిది. నేత్రోత్సవముగాఁ జూచి జన్మము సార్థకపఱచుకొనియెద. రమ్ము.

వినో—మంచిది.

(నిష్క్రమింతురు)

( తెఱ వాలును )

—:0:—

## తృతీయరంగము

రాజా సదానందదేవుని యేకాంతమందిరము

[ బకావళీ చిత్రఫలకమున కెదురుగా నొకకుర్చీపై సదానందదేవుఁడు కూర్చొని యుండును ]

సదా — అబ్బా! యీబకావళీ చిత్రఫలక మెంత సోయగముగా నున్నయది.

శా. వాలుంగన్నులతోడ దృష్టినిలిపా ◆ పైదల్గడాతీరు డా
కేలంజేరచి యూదలందు పదముల్ ◆ కీలించుమన్నేలపై
నాలోఁజించుచుఁ గూరుచుండెగఁద నే ◆ ఫాలంబు చన్దోయితో
ఫాలంబందున కస్తురిస్మేరయ సో ◆ ఫాకుర్చీపై హాసుగా

ఆహా! యిది నిజముగా భువనమోహినియే గాయుండనోపు.

మ. కురులొక్కింతగ్రవేల వీఁపున ధరన్ ◆ గుచ్ఛెల్లుజీరాడ, సొం
పారయన్ లేనవు మోమునందు, మెరయన్ ◆ బొంగారి సింగారమౌ
యూరువక్షోజయుగంబు పయ్యెదను నో ◆ హాయుంచు వగ్గింపనౌ
పరువంబారగ, గూరుచుండెగఁద సో ◆ ఫాకుర్చీపై ఠీవిగా

నిశ్చయముగా నీనెలంత మోము చంద్రబింబమని జెప్పవచ్చు నేమనఁ

చ. ఖళిఖళి బింబమాకృతిగ ◆ వక్త్రముడవంబు, కళల్ తెలింగునన్
బెలువగు శోభయుంగలిగి ◆ చెక్కులు సన్నగ చంద్రఖండమై
వెలయుచు వాతెఱన్ సుధస్ర ◆ వించుచు నెన్నుదు రర్ధచంద్రమై
యలరుచునుంట నీచెలి ము ◆ ఖాకృతిగాంచ సుధాంశుబింబమౌ

పఠికించిచూడగా నీచిత్రపటమునం దొక వైచిత్ర్యము గాన్పించుచున్నయది. అయ్యాది యతి స్వభావసిద్ధముగా నున్నయది. ఏమన?

ఉ. ఓరసిలెన్ బయింటగుచ ◆ యుగ్మమొకించుకఁగానుపింప, బం
గారుస్వరూపమైన మన ◆ కంబె ప్రకాశమునొందె వీనిశృం
గారమటంచు లజ్జవడి ◆ కక్కసతీర్చుకొనెండి యూహతో
బోరగమీఁదపడ్డగతి ◆ భూవలు కుప్పలు క్రిందకప్పెగా

కూపస్థ మండూకము క్రియ నీప్రపంచపుగోల రయుంగని నేను నాభార్యయే జగన్మోహన విగ్రహమని తలంచుచుంటిని కాని యీభువనమోహిని యగు నాబకావళి నెంత కాయింతి యొకటి సౌందర్యకర్త్రే.

ఉ. ఓహొ జనింప దేహనికి ♦ నొప్పగ నెట్టి జనించు, నాకలిన్
దాహముఁ గొప్ప నిద్రయు ♦ తప్పక దేహము పాలిపోవు, సం
దేహములేదు చేదగును ♦ తీపగు ప్రాణము, బుద్ధి దూరమౌ
మోహపిశాచ వీరగతిగ ♦ మూర్ధము నెక్కి కలంతపెట్టుగా.

మ॰ యూ నో దేవా! పరాదునొందక చిత్తగింపఁ బ్రార్థించుచుంటిని.

సీ. మతి చలింపఁగఁ జేయు ♦ మతిహీనునిగఁ జేయు, ధృతి పరిష్టావరించు ♦ నటవిఁ ద్రిప్పు
నగములఁ ద్రాకించు ♦ నగుబాటు తెప్పించు, వలువుమర్యాదలు ♦ పాడుఁ దోలు
దినము వ్యర్థముగ రా ♦ త్రినిచుక్కలఁ గణించు, వసుధను పొర్లించు ♦ పటము విడిచి
నాతికిఁ బలికించు ♦ నోరిమ ద్రోయించు, నేద్వాల బొబ్బల ♦ నెసఁగఁ జేయు

తే. గీ మోహమనెడి పిశాచంబు ♦ మూర్ధమెక్కి
ఇట్టి చెడుకార్యములను జే ♦ యించి తుదకు
గుండెలను దిని రక్తంబు ♦ గ్రోలివైచి
కట్ట ప్రాణంబు దీయు ని ♦ క్కంబుగాను

కావున నగవారికైనను మోహపిశాచ మావహింపఁగూడదని నాయభిప్రాయము.

సదా—చెలీ! నీ యుపన్యాసధోరణి నాతలకెక్కుట లేదు. నా హృదయఫలక మందు బకావలి రూపము చిత్రింపఁబడియున్నది. నా కన్నెదుట యిప్పుడా యొప్పులాడి నిల్చినయట్లు లున్నయది. ఏవిధముగా మరలించుకొనఁద మన్నను నాడెందమా యిందీవరాక్షి దెసకే లాగుకొని పోవుచున్నయది. ఇంద్రియ లోలుఁడ నగుటచే స్వతంత్ర హీనుఁడ నైతిని.

తే. గీ తరుణి! మోహ యంత్రంబనే ♦ తంత్రమందు
కట్టువడి స్వతంత్రముచెడి ♦ కదలలేక
ఆడ్డి యాడించిన తెఱంగు ♦ నాడుచుంటి
బొమ్మలాటకాండ్ర చెయిఁ దో ♦ ల్బొమ్మవగది

జగ—మహాత్మా! మిమ్ముఁ మోహమనే ఖడ్గము గాయపఱచుచుండ నా యొక్క మంచిమాటలనియెడి పలాస్త్రిని యుపయోగించిన నేమి ప్రయోజనము.

సదా—సఖీ! నేనేమిచేయఁగలను. మోహాగ్నిలోఁబడి పొఱలుచుంటిని. కట్టు బాటనే తెఱచీఱ నాయొనుటనుండి క్రిందికి జారిపోయినది. శక్యమను వస్తువు నాపైన విశ్వాసమును జూపుట లేదు. నాబుద్ధి చపలత్వమును బొంది నాస్వాధీనమునుండి తొలఁగిపోయినది. (అని ఏడ్చి)

వేంకటరమణ వృత్తము.

సారసాక్షి నన్ను గూర్చి ♦ సారసారె కాదటే
వినుదెందమా—పతియందమా—పయినొందదా

జగ— భూరికార్య ధైర్యసూర్య ♦ దూరమేల రమించవో
వనజాక్షికిన్—కన మీపయిన్—మనసుండదో

సదా— నారి! నిక్కమా మిటారి ♦ గారవింపకున్నచో
చెలి! ప్రాణముల్—త్యజియించెదన్—నిజ మచ్చటన్

జగ— మారకేళి ఘోరకార్య ♦ మూరకే యున్నచోన్
కలిదండ్రికిన్—ఇంక చెల్లదన్—గతి యేమిరా.

(అని యేకృవ పాదముల పైఁబడి మూర్ఛవోవును)

సదా—(స్వగతమున) ఇదివఱలో నేనొనరించిన సలహా ప్రకారము వినోదవల్లి హయములతో వరుదెంచిన నీసమయములో బాగుండును.

[ ప్రవేశము వినోదవల్లి ]

వినో—దేవా! బకావలీ యుండు బస్తానావ ప్లెకరుదెంచుటకు మంచి పసందయిన మావులను ఠీవిగ నలంకరించి జీనులతో కోటద్వారమువద్ద నిలిపితిని. రండు త్వరితముగా వెడలుదము.

సదా—నేను నదియే యోచించుచుంటిని. మంచిసమయమునకే యోచించితివి. ఇది మొల్కాంచిన కార్యభంగమగును. పద పద.

(నిష్క్రమింతురు)

( తెఱ తీరపడును )



శ్రీరస్తు

# బంగన్ బకావలి



అను

## భువనమోహిని

## ద్వితీయాంకము



### ప్రథమరంగము—ఘోరారణ్యము

[ సదానందదేవుఁడు వినోదవల్లి యను దానితోఁ గల్గియుండఁ
ప్రవేశించును ]

సదా—(సంతోషముతో) వినోదవల్లీ! మాయింద్రుని నందనవన మీగతిగా నుండునా? ఆహా! యేమి దీనిసోయగము.

ఉ. మించిన పచ్చరంగుల, న ♦ మేయపు పుష్పవనంబుతోడ, రా
యంచలతోడఁ గూడిన త ♦ టాకముతోడ, విహారముప్పుగా
మించియొనర్చ, దగ్గఱి ♦ మేలగు వీలగు రావఁబాటలో
క్కించుక విశ్రమింపఁదగు ♦ కెంజిగురాకుల చెట్లతోడ నీ
యంచితమైన తోటయల ♦ నాకకనుల్ మిఱుమిట్లుగొల్పుచున్

కానీ వినోదవల్లీ! యీవనాధిపతి సకలచరాచర సృష్టికర్త యగు భగవంతుఁడై యుండవలెను.

వినో—(స్వగతమున) ఈమాయావనము జేపాలుని కూఁతురగు "మాయామోహిని" యను కట్టుబోటు దానిదియై యున్నది. ఇందలి నేనూటంకమును తెలియఁగఁజేసినచో మనకార్యము జయప్రదముగా నగు నని నాయభిప్రాయము. (ప్రకాశముగా) రాజకుమార! ఈవనమై చిత్ర్యములను మీరంతగా విలోకింపవద్దు. మనము చేర వలసిన ప్రదేశమునుగూర్చియే యోచింపుఁడు.

సదా—వల్లీ! అప్పుడే మన ప్రయాణ మెంత పూర్తియైనదియో యెఱుంగుదువా? మనరాజధాని యగు బంగాళమును దాటి రాజపుత్రస్థానము మొక్క యెడారి తుదకేతెంచితిమి.

వినో—దేవా! యీయుద్యానమును గమనించిన యెడల సూక్ష్మతగా గమ్యస్థానమును జేరవచ్చునటులే.

సదా—ఏమటుల భయపడుచుంటివి.

వినో—ఈప్రదేశముయొక్క మహిమ యట్టిది.

[ అద్భుతమైన రెండు లేళ్లు నృత్యముతోఁ బ్రవేశించును ]

సదా—(సంతోషముతో) చెల్లీ! ఆ కురంగముల నటనము వాటి శృంగారాభినయమును వీక్షించుము.

తే. గీ. కుందనపు బంగరుసొమ్ము ◆ కొమ్ములందు
తొడఁగబడి జరీబుర్ఖాలు ◆ నొసలు కెల్ల
మెడను శ్రీలాడు పతకము ◆ మిలమిలనుచు
పసిడి నెమలులగతి చెర ◆ లాడుచుండె

ఇవి తెగఁబలసి చక్కఁదనముండెడి దృష్టి యొక్కుడుండుట వలన మిగుల నందముగా గనంబడుటయు పిడుగులవలె నున్న యవి.

వినో—(స్వగతమున) వీటి యాగమనము కొంప నష్టేటఁగట్టునటులే (ప్రకాశముగా) పుణ్యాత్ముఁడా! వీనికై భ్రమనొందక మన కార్యసాఫల్యమునకై ముందంజ వేయుము.

సదా—(వినిపించుకొనకుండా) ఏమి? యీజింకలపొందము నాకెంత కష్టము సంభవించినను సరే పట్టుకొనక మానను.

మత్త. ప్రాణముల్ గొనకుండ నిట్టులఁ ◆ బట్టుకోఁదగు యత్నముల్
మానుగా నొనరింతు నయ్యది ◆ మద్భ్రమదిన్ పారయించెఁగా

వినో—
మాన మానుఁడు బాల్యచేష్టలు ◆ మాయజింకలు సుమ్ము, అ
వ్వానివల్లను కార్యభంగము ◆ పైగదుఃఖము వాటిలున్

సదా—(ఉద్వేగలూను టభినయించి) ఆహా! వినోదవల్లీ!

మత్త. ముందుకార్యము మాటమాత్రము ◆ ముందుజింకలఁబట్టగా
నందమయ్యెను దుఃఖమబ్బిన ◆ నబ్బుగాక త్యజించనే
ముందుకంజను వేయఁజాలను ◆ పోవనిచ్చెద నాహయం
బెందుఁజొచ్చిన వానివెన్కని ◆ యేగి కేల్తొక లిప్తలోన్

అంతవఱకిచ్చటనే మసలుము. ఇదే పోయెద. చెల్ చెలో.

(అని గుఱ్ఱముతో నిష్క్రమించును)

తే. గీ. కాంతి యుదయించి నిర్మల ♦ స్వాంతులగుచుఁ
జెలఁగు తాపసవర్యుల ♦ చిత్తములుల
చలనమునఁ బదిలేక ని ♦ శ్చలములోయి
నిలచియున్నది యీచెర్వు ♦ నీరమకటా!

ఈనిశ్చల మగు జలంబును గ్రోలి నిశ్చలస్వాంతుఁడ నయ్యెద. (అని గ్రాగుచు నభినయించి) వహ్వా! ఏమీ నీరుచి. మంచులోఁ జక్కెఱ కలపి గడ్డపారించిన పాల వంటి తీయని రుచి కలిగి మిగుల చల్లగా నున్నయవి. (దీర్ఘశ్వాసము విడచి) అమ్మయ్యా! ప్రాణము లేచివచ్చినట్లున్నయది. (ఆకసమువంక జూచి చేతులుజోడించుకొని) ఓహో! దైవమా! దీనరక్షకా! ఆపద్బాంధవా! అనాథబంధూ!

ఉ. ఆతపబాధచేఁ మిగుల ♦ నార్తముఁ జెంది, విదాహ మొంద, సం
ప్రీతిగ నీకొలంకు గను ♦ పింపఁగఁ జేసి శ్రమంబు వాపి, న
ట్లాతతమౌ స్మరాగ్ని బడి ♦ యందుఁ గృశించెడు నన్ను దైవమా
నాతి బకావళీ మణిని ♦ నర్మిలిఁ జూపి శ్రమంబు బాపవే

(అంతఁ గొలనులో నీటిమట్టుపయికి బకావళివంటి యొక స్త్రీ) లేచి తనయూర్ధ్వ కాయమును జూపుచు)

ఉ. ఓ సుకుమార! ప్రేమయసఁ ♦ డొప్పఁగ వర్ధిని యున్న నే నశే
భాసురమైన మూర్త్యమును ♦ బైకొని గైకొనఁడౌ తలంపుతో
నీసమయంబునం దిటకు ♦ నిన్నిదినాలకు దైవమంపె చే
బాసు! బలారె! రమ్ము పొలం ♦ పారఁగ నిందె వసింతుమింటిగా

(అని తటాలున మునిఁగి పోవును)

సదా—ఆహా! దైవమిప్పుడే నాయెడల ప్రసన్నుడైనవాఁడు.

ఉ. ఉబ్బినచాచిదోయి పదు ♦ పొప్పెద మబ్రమగాఁగ, దేనియల్
జొబ్బిల మోవియుండి, సొగ ♦ సొల్కు ముఖంబున, వాలుఁజూపుతో
నిబ్బరకించి, రమ్మని ధ్వ ♦ నింపగ గాజులు కేలఁ బిల్వ, న
బ్బబ్బ! యిటులనిల్చుటిటు ♦ వచ్చెదమ నీకయిగా బకావళీ!

( అని గుభాలున నీటను మునుఁగును )

( యవనిక జాఱును )

—:0:—

# తృతీయ రంగము



ప్రదేశము—మాయామోహిని యుద్యానవనము—అందొక మహలు

[ మాయామోహిని సోఫాకుర్చీపైఁ గూర్చొనియుండ నెదురుగా మహిళ యను చెలికత్తియ నిలంబడియుండును ]

మాయ—ఓసీ! మహిళ! సదానందదేవుఁడు పదకొలనులో దాహమును గొనుచుండ "బకావళీ రూపమును ధరించి" నేనా నీటిపట్టున వంకను జేరి "ఓయీ! ప్రేమయను సముద్రములో నున్న నీవ నేమంది ముత్తియమును గొనుటకు సమయమునకే యేతెంచితివి" అని కేక వేసి మునుఁగ మునుఁగ నా వెన్వెంటనే యాతఁడు కూడ మునింగి యున్నవాఁడు. కాని యింకను నిచటికి రాలేదేమి?

మహి—చెలీ! అతఁ డెచ్చటనైనా దారి తెలియక మసలుచున్నవాఁడేమో?

మాయ—దారితప్పవలసిన యగత్యమేమి? ఉపదేశించినట్లు లా కొలనునుండి యీ మహలునకు మార్గము నిదానముగా నున్నయదే.

మహి—అయిననో గడి యరగడియలో రాఁగలఁడు.

[ ప్రవేశము సదానందదేవుఁడు కొంతదూరములో ]

సదా—ఆహా! యిదేమి యద్భుతము! ఆశ్చర్యము! అక్కజము!

ఉ. ఓరి! యిదేమి యబ్బురము ♦ హా! కననొక్క సరోవరంబులో
దీమగఁగ్రుంకి యీవనిఁ ♦ దేలితి, నెమ్మొయి గాని, మేనినం
బారఁగఁ దాల్చినట్టి వలు ♦ వంబులు గాని యొకింత నానలే
దారయ చిత్రమిట్టిది భ ♦ యప్రదమై మదికొల్లసిల్లెడిన్

నిశ్చయముగా నెంచిన యిక్కడిసరోవరము? ఎక్కడి యుద్యానవనము?

మాయ—నెచ్చలీ! అతఁడే రాజపుత్రుఁడు

మహి—(చూపు టభినయించి) నిశ్చయమే. నీకోర్కి పూవు, కాయ, యవస్థమారి పండుగా బరిణమించినదనుకొమ్ము.

మాయ—ఎట్లు? క్రియకట్టవలెనుగఁదా?

మహి—మన మాయలను దాటి యిక్కడికి బోఁగలఁడు. వంటయింటి కుందేలనుకొమ్ము.

సదా—(వనమునంతయు తెప్పగా బరికించి) ఈవనము నవులదై యుండునా? కిన్నరులదై యుండునా? ఈవృక్షవైశల్య మెంత మాత్రిగా నున్నయదే. ఆహా!

ఉ. చొక్కపుటక్కళుల్ పక్షితతి ♦ లీలను పాదపమూలలొప్పె, పెం
పెక్కిన పుష్పముల్ ఫలము ♦ లింపుగ నొండొరులొక్కవానితో
నొక్కటిమాటలాడుకొను ♦ చుండెను, పత్రచయంబు గాంచగా
జక్కని రత్నసమ్మిళిత ♦ జాళువరేకుల గాయనొప్పెగా

ఇయ్యది భూతిలవనము కాదుకదా. (ఇటునటుం జూచి) అదిగో యిద్దఱు ముద్దియలు ముచ్చటలాడుకొనుచున్నవారు. వారలపై యీ యారామ ముండనోపు. వారల సంగతి విలోకించిన నయముగా నుండెను. ఈవనవైచిత్ర్యము విలోకింప భయముగా నున్నయది. వారలను సమీపించి కనుంగొనియెద. (అని సమీపించుచు)

మహీ—అయ్యా! మీరెవ్వరో నిరాటంకముగా నిందులకు రావగునా?

సదా—బ్రహ్మణ్యుపై వాకిలేనివారికిం బ్రవేశించుటకుం దగినది తగనిది యను స్థల వివక్షత యుండునా? (అని మాయామోహిని ప్రక్కను గూర్చుండును)

మాయ—మహీశా! యిదేమిచమత్కారము? పాతబంధువువలె నాప్రక్కను గూర్చున్నవాఁడు.

మహీ—పాత బంధువువలెనె యగుపడుచు మీతోఁ బురాతనమున నుండి చెలిమి గలవాని గతిఁ జెంత నొకింతైన వ్యత్యాసము లేకుండఁ గూర్చొని యున్నవాఁడు ఏది యెట్లున్నను వీరియుపన్యాసకము బాగుగా నున్నయది. మిమ్ముల నెఱుంగని వారలు మీరిద్దఱును మేనత్త మేనమామల బిడ్డలనియో లేక నాలుమగలనియో తలంచక మానరు.

మాయ—ఏది యెటులున్నను? మన యింటికి వారతిథులు, కావున మనము ముందుగ మాటాడి యతిథిసత్కార మొనరించవలెను. (సదానందునితో) ఆర్యపుత్రా! ఎచ్చటనుండి తమరాకడ?

సదా—నన్నడుగ నేటికి నాపేరు నీకే తెలియును కాని మేము పరాయులము.

మహీ—మీరు పరాయులైన మాగృహంబునకేల యేతెంచెదరు?

మాయా—దేవా! మేమని బహువచనము పల్కుచుంటిరే. ఇందు మీతోఁ బాటు నేనుకూడా పరాయిదాననా యేమి?

మహీ—అమ్మా! ఈమహనీయుని వచనంబులయందు అనృతము లేదు. ఏమంటిరా? ఈవనము భవజ్జనకుండగు జేపాలునిది అది వారికి పట్టినట్లిప్పటికైన నెరవే కాని స్వంతము కాదుకదా? అది గ్రహించియే నాగటుల పల్కెరి

సదా—(స్వగతము) ఈపడోజానవయే నాకాసరోవరమునందు కాన్పించినదియై యుండనోపు. ఇది నాకార్య విఘాతమునకు కనిపెట్టెగాపరించుటయే కాక పైగా నాతో నిచ్చకము లాడుచున్నయది. (ప్రకాశముగా) ఎందులకీ ప్రస్తావన.

మాయా—మహిళా! ఆఁకలితో నున్నవారిని పరిహాసమాడిన కోపము రాఁగలదు. కావున నిగు ఫలహారవస్తువులను గొనివచ్చుటకు పనికత్తెలను నియమించుము.

మహి—మంచిది (అని లోనికరిగి పదిమంది స్త్రీలతో వెండిగిన్నెలతో సారాయి బంగారు పళ్ళెములతో మాంసమును గొని ప్రవేశించి) అమ్మా! యిదిగో గొనివచ్చితిని. (అని సదానందదేవుని ముంగల నుంచును)

మాయ—మహాత్మా! దానిని స్వీకరింపుఁడు.

(అంత పళ్ళెరమునుండి ధ్వని)

సదా—(భయము నభినయించి) మహిళా! యీసారాయి మాట్లాడుచున్నయదే. ఏమీ? యీ యాశ్చర్యము.

మహి—మహాత్మా! యేమని?

సదా—

మత్త. మీరు మమ్ములఁ ద్రావిచేసియు ♦ మేము పట్టిన భంగి మీ
కాఁగుండిన దుఃఖసాగరి ♦ యీలు నాలును కావునన్
వీరుఁ డీనుకు నోటిచెంతను ♦ చింతవాసి ముదంబుతో
నారగింపుము పోయియా సుఖ ♦ మబ్బు ప్రబ్బుగ దేవరా!

మాయ—దేవా! అందులకే యక్కజపడుచుంటిరా? చూడుఁడు! నా మంత్ర ప్రభావము! మీరలు కోరినఫలము వృక్షము నుండి పక్షిరూపముగా మీ చెంతకేతెంచి నృత్యమొనర్చుచు మీ నోటివద్దకు వచ్చునటట తానే తినుఁడు తినుఁడని యేకసెంచును. మీరలెంత భుజించినను దానికిఁ దరుగులేక మీరలు తృప్తిపొందిన పిమ్మట నా ఫలము మరల పక్షిరూపము ధరించి చెట్టున కెగిరి తన స్థానమును చేరి మరల ఫలరూపమును బొందును.

సదా—(స్వగతమున) ఇదియొక మహామంత్రకత్తెవలె నున్నయది. నామనో దుఃఖము బాపి యీచిత్ర మొకింత చూచెదగాక (ప్రకాశముగా) మోహినీ! అంల ము గానిమ్ము. (అని యొక ఫలమును జూపును)

మోహి—చిత్తము. (అని యేకో యొక మంత్రమును జదివి బెత్తముతో నా పండుపైఁ గొట్ట సదానందుని నోటికడకు నృత్యముతోఁ బక్షిరూపముగా వచ్చి నిలుచుండి తినుఁడు తినుండనును)

సదా—(భయము నభినయించి) మోహినీ! నాకు దీనిని గాంచ వెఱపు జనించుచున్నయది మరల పాదపశాఖను నంటుకొనునట్లొనరింపుము.

మాయ—చిత్తము ఓ ఫలరాజమా? మరల నెప్పటివలె నలంకరింపుము. (అని బెత్తముతో నాఫలమును గొట్ట నది పక్షిరూపముగా నెగిరి ఫలమై వృక్షము నంటికొనును)

కావున భవజ్జనకుని యాజ్ఞ చెల్లించి యిచటున్నటుగా రావలెను.

మాయా—మీ కేమియు భయము లేదు. అప్పపాటులోఁ దిరుగ వచ్చెదను. సెలవు. (అని నిష్క్రమించును)

సదా—అమ్మయ్యా! యిప్పటి కీగండము గడచినది. ముందు దీనిని వంచించి యీకావువనుండి వెడలిపోవుట యెట్లు? ఇది మాయలమారిగంప. దీనితో స్నేహమంగీకరింపకున్న దీని మంత్రతంత్రములు మనవు నేర్పదు. అట్లుల గాకున్న దీనిని వంచించుట చాలా దుష్కరము. (తలపంకించుచు నాకసమువంక కొంతసేపు చూచి నిలిచి) బళే! బహు చమత్కారమైన యుపాయము తోచినది. అదివచ్చు సమయంబున నా యూహ వెల్లడించెద. (అని యిటునటుఁ జూచి) ఆ! అదిగో వచ్చుచున్నయది. మిగుల చమత్కారముగా నిప్పుడు కంగా దానిని వంచించుట. (మోహినివచ్చెడి వాక కొండవైపునకు జూచి) చీ! పరుగిడెదవేలా? ఆగు మాగుము. మామోహిని రాలేదులే. పోకు పోకు. మోహినికంటె నీయందనురాగము కుదిరినది. రారమ్మ. (అని కంగారు నభినయించును)

[ ప్రవేశము మోహిని ]

మాయా—దేవా! ఏమిటుల కంగారు చెందుచుంటిరి. ఎవరిని పోవద్దనుచుంటిరి!

సదా—చో! వచ్చితివా? మంచి సమయమున కేతెంచితివి. (ఆయాసము నభినయించి) అమ్మయ్యా! బ్రతికితిని. (అని కూర్చుండును)

మాయా—ప్రియా! ఏమిటుల నాయాసము కల్గినది?

సదా—చెలీ! (విచారముతో) నాకిక్కడ భయమగుచున్నయది. (కన్నీటిని గోటను చిందునట్లభినయించి) యిదేమిపాపము! యీస్థలమంతయు రాకాసియూకతో నిండియున్నదో లేక నామనస్సును పరీక్షించ నీవు పంపించిన రంభలాఁడియో నాకు తెలియదు. నీవటు లేఁగఁగానే నాయంద కొక యంచయాన యేతెంచి నన్ను వచించ రాని మర్యాదలాడి నాగడ్డము పట్టుకొని ముద్దుగొని యోయీ! యువకుఁడా!

ఉ. మోహినికంటె నాకు వెయి ♦ మోస్తరులైనటి మంత్రముల్ గల
గ్రాహకురాల నేను నిను ♦ కన్గని యూనుకు దీయునంతలో
సాహసమొప్ప నెత్తుకొని ♦ చయ్యన నాకళ్యమార్గమునందె నా
గేహము నందు డించెద నని ♦ కేమి యొనర్చునో చూతు మోహినిన్

అని నాకడ్డమ్ముఁబడుచు నాహస్తద్వయంబు జోఁపి పైవనెత్తుటకు యత్నించునంతలో నీరాక యారాకాసి గ్రహించినది కాఁబోలు. అట్లాలున పారిపోయినది. ఏమిచేయుదును? నావద్ద మంత్రసామగ్రియు లేదు. తంత్రసాంగత్యము యసలే లేదు యంత్రసాధనము యెఱుంగను.

సదా—సరే నేను తలంచిన గతిగా నీభూతిపూనకుఁ దగినదాంత. చేసితిని. ఈ రక్షాబంధము దానికి ననుబంధమే. ఇది విప్పి యిందు యేమున్నది చూచెదను. (అని తాయెతును విప్పు టభినయించి) ఓహో! యిందులో బీజాక్షర సంబంధమగు దండకము కలదు. (మరలపరికించి) యింకేమిలోలు? యిం దనేకములైన మంత్రము ఉన్నవి. ఒకటి యితరులవారి ప్రయోగము తాకకుండుట. రెండు దుఃఖములు రాకుండుట మూఁడెటులైనను బోవలె నన్న బోవదగును. నాలుగు తియ్యగ మనము కూడా యితరులపైఁ బ్రయోగములు ప్రయోగింప వచ్చునట. కంఠోక్తిగా నీమంత్రములన్నియు పఠించెద. (అని చదువుట నభినయించి) ఇఁక కంఠోపాఠమైనది. మరల నెప్పటి తెలంగున దండకు ధరించెద. (అని ధరించి మౌనముగాఁ గూర్చుండును)

[ ప్రవేశము మాయామోహిని ]

మాయా—(దూరముగనుండి) దేవా! మాటాడక కేమిటి జపించుచుంటిరి.

సదా—(తేఱిచూచి) ఏమున్నది? తాయెత్తునందలి బీజాక్షర సౌంజ్ఞను పఠించుచుంటిని.

మాయా—ఆ తాయెత్తును దూరముగా నుంచెదరా?

సదా—ఎందులకు?

మాయా—మీ చెంతను గూర్చుండుటకు. మీతో ముచ్చటించుటకు. మిమ్ముల నాలింగన మొనర్చుటకు.

సదా—(కోపముతో) ఏమేమి? మాయలమారిగంపా! నీవెవతెవు? నాతో ముచ్చటించి నన్నాలింగన మొనర్చుకొనుటకు. (తలపంకించి) హాం జాగ్రత! ఇదివఱకు సదానందుఁడు గాఁ డితండు. నీ కాక్రందనము గూర్చువాఁడని గమించుము. అట్లు:-

ఉ. ఎన్నలకేమి? నీవనను ♦ నేఁడి యొకర్తిన మాయకింక నా
యొత్తనంటే కాదు నిలు ♦ వెల్లను బంగరుపూఁతిఁ గూడ నా
యొత్తును దూరమం దునప ♦ నెత్తుగడన్ వరిమాను మించి దోం
గెత్తలు సాగిరావు, పెద ♦ వెత్తిన నెత్తుగు చేయినెత్తిన్

(అని హస్తమెత్తి చూపును)

మాయా—దేవా! నన్నేగతాళి చేయుచుంటిరా?

సదా—నిన్నేగతాళి చేయుటకు నామనువవా యేమి?

మాయా—అయ్యో! యిదేమిపాపము! నేనెవతెను?

సదా—నీవా? మాయలాడివి.

మాయా—ప్రియా! మాయలాడి శబ్దము టక్కులాడి యని కలదు. కాబట్టి—

ఉ. టక్కులు టెక్కులున్ మఱియు ♦ ధాకయు వీఁకయు మప్పి గుండె పి
ఱక్కుటయట్టి నీదుకడఁ ♦ గప్పడఁజేయుక మన్న, వేని పో
ప్రక్కను జూపు, దట్టు కన ♦ పగ్గెక నాకు మనంబు నొప్పు నే
యొక్కడయొప్ప, వానికి ♦ నొప్పని యొప్పిన మీకు నొప్పునే

సదా— నాకెందుల కొప్పదు. నీగళమునకు నే సూత్రమును గట్టితినా? నీవు గంగలోదిగినను నాకు నిమిత్తము లేదు. ఇదే నేపోయెద. (అని నడచును)

మాయా— (అడ్డుగానిలచి) మీరలు సూత్రము గట్టకపోయినను మాయుఁడు మనల కిద్దఱకు వలపనె సూత్రముచే గట్టిపెట్టియున్నవాఁడు.

సదా— నీవాసూత్రమును నిప్పుడే త్రెంచుకొమ్ము. నీకు దూరముగా నుందును. నీవు గట్టిగా మాటాడిన వాక్పంధన మొపర్చెదను.

మాయా— సాము నేర్పిన గురునిపై దనసామును బ్రయోగించినటుల నా యంత్ర సామర్థ్యముచే నన్నే బాధింపఁదలఁచితివిగా (కోపముతో) సరే. కానుకొమ్ము. ఇదే నారికేళీఫలము (అని యొక కొబ్బరికాయను జూపి) దీని మంత్రించి నేలపైఁ గొట్టి వేనవేలు కొండచిలువలను జనింపఁజేసెద. వాటిని హరింపఁజేయుదేని నీవు నన్ను జయించినవాఁడ వేయగుదువు. లేకున్న నీపని యీనాఁటితోనే ముగింపబడినదనుకొమ్ము.
(అని కొబ్బరికాయను చేతితోఁ బైకెత్తిపట్టి)

దండకము. ఓ కాళి! భద్రకాళి! కాత్యాయనీ! గౌరి! దాక్షాయణీ! శర్వరీ! శంకరీ! శాంభవీ! పార్వతీ! అంబికా! చండికా! దుర్గ! నిత్యంబు నీపాదముల్ నేను సత్యాత్మనై గొల్తు నే నీదయాదృష్టి నాకష్టమాలించి యీదుష్టునిం గూల్చ నీ భ్రష్టునిం గాల్ప నీ నారికేళీఫలంబందునం దుండి వేవేలు, ఘోరాసయముల్ మోకోపం గానతిమ్మా ప్రియంబార మాయమ్మ నీకే నమ్మి యీధాత్రిపైఁ గొట్టెదిద్దాని నిష్టే నమస్తే నమస్తే నమః. (అని భూమిపైఁ గొట్టగా నే వేనవేలు కొండచిలువ లుదయించి సదానందుని చుట్టునిలచి యాడును)

సదా— ఓసీ! మాయలమారి! మందులమారి! యీ కొలకొలంది యుద్భవించిన కొండచిలువలు నన్నేమిచేయఁగలవు? అల్లంతదూరమున నుండవలసినదే కాని నాచెంత కావంతయైనను రాఁజాలవు. ఒక్క త్రుటిలో వీటిని నీటడగించెద చూడుము నామంత్ర మహిమాతిశయంబు. (నేలనుండి కొద్దిగా బూడిదనెత్తి పైకిఁజూపును)

దండకము. భూతేశ! యీశా! మహేశా! గిరీశా! శివా హ్రం పినాకీ! కపర్దీ! మహాదేవ! క్లీం రాం విరూపాక్ష! మృత్యుంజయా! హ్రీం హరా! భర్గ! భర్గప్రియా! హ్రాం భవా! భీమ! గంగాధరా! సర్వ!, జాం జాం మృడా! రుద్ర!

చేసెదము. ఈసంగతిని మిగుల మంత్రవేత్తయును కట్టుబోతువిద్యయందసమాన పాండిత్యమును గల భద్రకునకు కెఱిగింతము. (అని లేచి చూచి) ఏమి విచారించెదవు?

ఉ. మధురపదార్థమిచ్చి బహు ♦ మానముగా ధనరాశు లిచ్చి నే
విధముల బాలించినను ♦ ప్రేమ జనించునె? పోషించినన్
విధిగదిలేని ప్రేమకుట ♦ నీటను కాకికిఁ గోకిలంబికిన్ వా
కిడ్డఁగల నీటిబుగ్గను పా ♦ రించక నిల్చునె మందగామినీ!

పదపద యీకపటనాటకరంగముయొక్క కథవంతయును మహేంద్రునికి విన్నవింతము. (నిష్క్రమింతురు)

తెరవాలును



## చతుర్థరంగము

కేపాలుని యాశ్రమము.

(కేపాలుఁడొక వేదికపైఁ గూర్చుని యుండ విచారించుచు మాయామోహిని మహిళతోఁ బ్రవేశించును)

కేపా—(మోమును దిలకించి) అమ్మా! మోహిని! యిదేమిభావము? ఎన్నఁడు నీతీరుగా నిను గాంచియుండలేను

ఉ. కలకలలాడుచుండు నగు మొం ♦ గంబున గర్వదుదీర్ఘ ఖేదురా
వెలవెలఁబోయి పీఁకు వడి ♦ విన్నదనంబును బొంది యీయెడన్
జలజల బాష్పబిందువులు ♦ చక్షులనుండి కపోలపాళిపై
బలబలఁగారఁ జేర్చెదవు ♦ వచ్చిన యాపద నేర్చి పల్కుమా

చెలిమికత్తియలు బలంకరించుటలేదా? పనికత్తియలు వ్యతిరిక్తముగా సంచరించిరా? కారణ మతిరయంబుగా వచింపుము.

మహి—మేము మీకును మీకూఁతునకు నన్యథా సంచరించిన బ్రతుకెక్కడిది?

కేపా—ఎందులకీ విచారము? దొంగిలిన పెన్నిధానమును బోగొట్టికొనిన భాతి, చేఁ జేతికందిన వస్తువును చేఁజేత విడిచిపెట్టిన తెఱంగున, ఎద్దియో పెద్ద బంగారపు కొండను వదల విడిచినగతిగా నంతగా వెక్కివెక్కి యేడువనేల?

మోహి—తండ్రీ! నా చేఁజేతల పోఁగొట్టుకొనిన వస్తువు నీవు వచించినవాటి కంటెను మిగుల ఘనమైనది.

మహి—దేవా! ఆమాట యథార్థమే.

దేపా—నాకేమియు నర్థముగుటలేదు.

మహి—అర్థమునకేమున్నది వినుండు.

ఈ. సుందరుఁ డంబగాను కదు ♦ మోపరి వాగరి పోసు కాఁడు, మీ
సుందర రూపుసంపదల ♦ శోభకు వన్నెటి తుద్దియౌ సదా
నంద ధరామహేశ్వరుఁడు ♦ నమ్మిక నెమ్మదియునర్చ మాయచేఁ
బొందుగ మంత్రి తాయితును ♦ ద్రుచ్చిలి తెచ్చెను పాతిపోయెగా

దేపా—(త్రొందరగా) "పతినుచేమాని" యను తాయెత్తునే యపహరించెగా.

మహి—అదికావున నే విచారము.

దేపా—(విచారముతో) అయ్యాగారూ! కొంపముంచితివే. వాఁడు నీకెక్కడ కంభవించెను. అది వానికేల నొసంగితివి?

మత్త. ఎత్తు లెన్నొ పన్ని ప్రాణము ♦ కెత్తుకొంటెను మింద తా
యెత్తుతెచ్చి యొసంగి తెం దన ♦ నీవు మత్కులజాతి సం
పత్తి రాశివి నన్ను గాంచిన ♦ మాతవం చిడినాడ నా
యెత్తు ద్రవ్యము నిచ్చినన్ మరి ♦ యిత్తునే పెఱవారికిన్

మాయా—జనకా! ఏమిచేయను. వ్యామోహపిశాచము నాశిరమున నిల్చి ప్రపంచపు వ్యక్తత లేకుండగాఁ జేసినది. తండ్రీ! సిగ్గువిడచి వచింపుచుంటిని వినుము.

సీ. ఆనందుఁడు సుమి బ్ర ♦ హ్మానంద మిదునను, మయి కామదేవత ♦ మతిని నిలచె
ఆనందుఁడే పర ♦ మానంద మయమను, రతి మారదేవత ♦ కనులుకప్పె
ఆనందుఁడే హృద ♦ యానందమూర్తను, నెతిస్మరదేవత ♦ నురులుకొల్పె
ఆనందుఁడే త్రిది ♦ వానంద సముఁడను, పతి మోహదేవత ♦ యరుప మెదపె

తే. గీ. సచ్చిదానంద మానంద ♦ సగుణగుణుఁడు
తన్మయానంద మానంద ♦ తేముఁడుఘనుఁడు
త్రిభువ నానంద మానందు ♦ దభిజనుఁడని
యూసదానందుపై వల ♦ పంకురించె

అక్కటవ నాప్రాణరక్షణమే వాని ప్రాణరక్షణముగా నెంచి, యాతఁడే మేటి కిరీటమనుకొని, యాతఁడే లేకున్న యీలోకమే లేదనుకొని, ఆతఁడే నేను నేనే యాతనిగా భావించి యా తాయెత్తు నాకృత్రిమ స్నేహితునికొసంగఁదలచివచ్చెను.

మహి—మహాత్మా! దేపాలా! మీకు దెలియుని సంగతు లేమున్నవి?

ఉ. మానుగ మారదేవతలచే ♦ మస్తరుచెంది యశోధనంబు, స
న్మానధనంబు ప్రాణధన ♦ మాదిధనంబు లొసంగి దానుతై

యౌవన ప్రేమచే బురుషు ♦ లుగ్రులు లొండొరులం జరింప నీ
భావిని యొసంగె తాయితన ♦ పొందగ వ్రతము మెందు కిత్తరిన్

జేపా—ఒడలెఱుంగని నిపము ముప్పుతెచ్చునని యెఱుంగవలె.

మాయా—తండ్రీ! సదానందుండే నాశాశ్వతధనమని యెంచి జ్ఞానధనసూన్యనై ప్రాణధనమైన రక్షాబంధన మొసంగితిని. చేతనుండి జారినదానికి నిందించిన ఫలమేమి?

మహీ—మంత్రమూర్తీ! ప్రేమ యెంతపనిచేసినను చేయఁగలదు.

జేపా—ముందుకర్తవ్యమేమి?

మహీ—ఎట్లయినను వానిని బంధీకృతునిగా నొనరింపుటయే.

జేపా—(లేచి కోపముతో) బంధీకృతునిగాఁ గాదు.

శా. తరుణీ! ముందుగఁ జెల్మిఁజేసి యతి ని ♦ త్యాశక్తితో నున్నటుల్
వరమైత్రిం దగఁగొల్పితాయితు నహా ♦ వంచించి గొన్నట్టి యా
దురితాత్మున్ దుర్వారినిన్ గులువనిన్ ♦ దుర్మార్గునిం బట్టి నా
కరవాలంబున కత్తు ఘుక్తిగను వే ♦ గనొప్పయి నేఁడాత్మజా!

ఇఁక నీవతి సంతోషముగా నుండుము. (అని వెడలఁబోవును)

మాయ—(అడ్డుగా జని చాతని నాపి) తండ్రీ! అంతమాటనవలదు. పుండు గలచోట రక్ష వేసిన కుసుపుమానినగతి;—

కెపిరాం విరాజితము.

అకేఁడు బకావలి ♦ యుండున మిక్కిలి ♦ యర్మిలికల్గి ♦ చటాలున నా
జతవిడనాడగ ♦ సత్వైను మోసమ ♦ సహ్యతచే విడి సాగగరే
దలివ బకావలి ♦ వట్టిణఫంచిన ♦ నాతేఁడు జచ్చిన ♦ యట్టులె నా
జతగలిత్తయి పరి ♦ చారకుఁడై పరి ♦ చర్యలొనర్చు ప ♦ కం వదుఁగై
కావున దానింజంపి వానింబట్టి తెచ్చుటకు యత్నించుము.

జేపా—అమ్మా! నాకుండుకున్న కోపాగ్నిచే వానిని బరిమార్తునంటిసే కాని దాని కెప్పుడయితే యంగరక్ష నొసంగితివో వాఁడప్పుడే యజేయుఁడని యెంచుము. దాని ప్రభావము వినుము. ఆయంగరేకునకు "నక్షసురమానన" యని యసలు పేరు. అనగా సమస్తదేవతలచేత మన్నింపఁదగినదని యర్థము. దానిని క్రమముగా "నక్షసురే మానిని" యనుచుంటిమి. శాస్త్రీయుఁడ నగు నీను;—

కం. కక్షగ తపమొనరించఁగ, చోక్షమునకు మెచ్చి "నృక్ష ♦ సురమానన" ప్ర
త్యక్షంబయి కాళియొసఁగె, రక్షయి పరమంత్రబాధ ♦ రానియదంచున్

అని వచించె. ఎవరైతే మిమ్మును మోసగించి యారక్షనుగొనిపోవుదురో వారి

వలన ఏమా కాపాటము కలుగుననికూడా కాళి వచించి యున్నది. ఇప్పుడామాట జ్ఞప్తికి వచ్చి నాయుల్లము ఝల్లని భయార్తిని చెందుచున్నయది. (అని కూర్చుండును)

మోహి—(స్వగతమున) ఈతఁడిప్పుడు పిఱికిమందుగొని యున్నవాఁడు చులుకు పాలు పుట్టించి యీ బకావలిని మట్టుపఱచి యామిట్టుపడు టెనిని బట్టుకొని వమ్ము లాగున గావింపవలె (ప్రకాశముగా) తంత్రీ! సిగ్గువిడిచి వచింపుచుంటివి. జయాప జయములు దైవాధీనములు. నీవే గెలిచెదవో యీవగపాలుఁడే గెలుపొందునో తెలియదు కదా? నీప్రాణముపోవుట తెలియదు కాని ముందుగా నాప్రాణముపోవుట నిశ్చ యము. ఏమంటివా?

ఉ. ఈగతి భీతిఁజెంది పిఱి ♦ యేగక యుండిన మన్మథాగ్నిలో
నీఁగెద రాకుమారుపయి ♦ హెచ్చిన యిచ్ఛరు నంతమీఁద నీ
వేగదు నాపయింగల మ ♦ మేకముచే నెటులైన నిష్ఠురుఁ
బోఁగుగ మృత్యుదేవతకుఁ ♦ బాల్పడుటేకఁద నిశ్చయంబుగాఁ

కావున మనలోటులేక యత్నించిన దానిపై దైవయత్నముకూడా లభించిన యీనరపాలుఁడు దొరకిన మనమిర్వురము ధన్యులమే. అంతియె కాని ముందుగా చచ్చు మందిన ఫలమేమి?

మహి—(స్వగతమున) మోహిని నిర్మోగమాటముగా జచ్చుతెగవేసి తంత్రి యెదుట వచించి యాతని కొంకింత భూతలనాథునిబట్టు పురిగొల్పినది. ఇఁక నేపూర్తిగాఁ బురికొల్పెద (ప్రకాశముగా) ఓమంత్రిసార్వభౌమా! నాయూఁతున కెన్నియో మంత్ర తంత్ర యంత్రములను నేర్పి వలసినంత ధనమిచ్చితి నీకు నేమిలోటని యెంచుచుంటివి కాబోలు? ఒక్కసంగతి వినుము.

ఉ. సారెలుచీరలుఁ నగలు ♦ చాలినరొక్కము లిచ్చియుండి పెఁ
గూరిమితోడ నాత్మజను ♦ గొప్పగఁజూచిన లాభమేమి? ని
స్సార మదంతయుఁ జెలికి ♦ సఖ్యునిగూర్చి చేయకున్న సం
సారిగ, సిగ్గుపాట్లు, నగ ♦ చాట్లగపాట్లను బొందెదొమనీ.

(మాయామోహినితో) సఖీ! మీతండ్రిగా రిప్పుడే కారణమువనో భీతాంగులై యున్నవారు వారివల్ల నింక ప్రయోజనములేదు. నీయదృష్ట మెటులున్నదో యటుల జరుగును రమ్మా వెడలుదము.

మాయా—మంచి తెస్సగావచించితివి. రా వెడలుదము. (అని పోఁబోవును)

తేపా—(అడ్డుగాజని) అమ్మా! ఆగుమాగుము.

ఉ. బాలకమించవద్దు జరు ♦ పాలుఁడు రేపటినుండివచ్చె డో
గోల భరింపఁజాలఁడుగ ♦ గూఁగుపశుం దగుభర్త గూర్చుటం
దాలము వచ్చెనేని గెలు ♦ పందగ లేవని యెంచి భీతి కే
మూలనొ డాఁగినాఁడనిఁడె ♦ పోటు సుదుల్ పడె కొంతమాత్రము౯

కావున నేనిదే వెడలుచుంటిని. ఇంటివద్ద బహుభద్రము. (అని నిష్క్రమించును)

మాయా—మహిళా! మన మనుకొన్నప్రకారము కుయుక్తులను బన్ని తండ్రిని గోనందుని గొనివచ్చుటకు బంపితిమి. ఇఁకవాఁడు తప్పక జిక్కినవాఁడె

మహి—అయినచో నీకుఁ దక్కినవాఁడె నీకౌఁగిటఁ జిక్కినవాఁడె. నీబాహులతలం దుక్కినవాఁడె నీమదికెక్కినవాఁడె. నీయౌవన జ్యోత్స్నలో స్రుక్కినవాఁడె. రమ్ము, నివాసమునకు వెడలుదము.

మాయా—మంచిది. చిక్కనిమ్ము. ఆపైన యోచింతము. (నిష్క్రమింతురు)

తెఱ వాలును

---

శ్రీరస్తు

# బంగన్ బకావలి



అను

## భువనమోహిని

## తృతీయాంకము



### ప్రథమరంగము—నాగపుర ప్రాంతము

మోహినీ యుద్యానవనము.

[ప్రవేశము సదానందదేవుఁడు కాలినడకను]

సదా—(ఆనందముతో) ఆహా! యీశ్వరవిలాసము పరమాద్భుతము కదా? నేను వినోదవల్లి మాటలను పాటించి బకావలినిమిత్తమై వనంబుల కరుగుటయేమిటి? మధ్యను మాయామోహిని యను కట్టుబోతు మిత్రారి కట్టడిచేయుటయేమిటి? అంతయు నొక విచిత్రమైన స్వప్నావస్థగా నున్నయది ఆహా! భగవానుఁడా నీచైదములు మహాద్భుతములు. నీవిలాసము లతి విచిత్రములు. నీసంకల్పము లమోఘములు కదా! అటులఁ గాకున్న:—

శా. అంతామిథ్యయటంచు చెలింగి నరులు ♦ త్యాశా విమోహాత్ములై
కాంతా కాంచనమందు భ్రాంతి విడరే ♦ కట్ దేహ ముల్లీలగా
నంతంబొందుట కొప్పుకొందురుగ, ని ♦ త్యంబైన మోక్షార్థమా
వంతైనన్ దలపెట్టిరేమి చన, దే ♦ వా భక్తచింతామణీ!

అందుల కుదాహరణ మెవ్వరినో సూచింపనేల? నేనేయైయున్నాఁడను ఏమన?

మ. అవనీరాజ్యము కల్లుమోయుటకు, నెం ♦ తైనన్ ధనం బుండెఁగా
జవరాలంటివ లోకసుందరి యగున్ ♦ సాధ్వీగుణారత్నమా
యిది యీతీరున గల్గియుండి తగునే ♦ యీకావలోఁ జొచ్చుటల్
భవదీయాద్భుత వింత కల్పనగు లే ♦ వా భక్తచింతామణీ!

(తలపంకించి) మహాత్మా! దేవాదిదేవా! నిన్నునమ్మి చెడినవార లీ భువనత్రయంబున నెవ్వరును లేరు. కానిమ్ము భవనంబున నున్నవారిని కనుఁబుంగవుః దిర్చితిని. నా

గలవానికి నాయొయ్యారిని మెఱుఁగాఁ జూపితివి. ఇది యెందుకో? అదియును నాకందులకే మంచిది. (అని యిటునటుఁ జూచి) ఏమీ? యీయుద్యానవనసోయగము?

సీ. వివిధరంగులతోఁట ♦ వికసించుపుష్పముల్, కత్తిరాసులగతి ♦ బ్రబలుచుండె
వింతవింతలగడ్డి ♦ వేరకాల్ తోలకాదు, టదితివాసులవేసి ♦ నటులనుండె
మొలకచాళుల మధ్య ♦ వలనీటి కాల్వలు, కొండచిల్వలు పాఱు ♦ కోపుగుండె
తెరువరుల్ నడకకు ♦ సరియగు రస్తాలు, పఱుపులు పఱచిన ♦ పగిదినుండె
తే. గీ. యంత్రములు నీటి నెగఁజిమ్ము ♦ టన్నివోట్లఁ
గాంచఁగల యంపివల్లిన ♦ గతిగ దనరె
విరులకాంతిని చెడకుండ ♦ వృద్ధిపఱచి
మంచివాసన పోకుండ ♦ మనుచుచుండె

ఆహా! యీ నీటిబిందువులు నాపైఁబడుటచేతను నీవిరుల సువాసన నాఘ్రాణించుటచేతను, చల్లని పిల్లగాలి శరీరమునకు తాఁకుటచేతను, కొంతశ్రమ తగ్గినది. అల్లదే పిల్ల నీటికాలువప్రక్క పచ్చికపట్టున చెట్లగుంపులోఁ గూరుచుండి యీ వన వైచిత్ర్యమును జూచుచు కొంత విశ్రాంతిని జెందెదనుగాక. (అని నాలుగడుగులు వైచి కూర్చుండి) భళిరా! యీ యాకసమంతయు మబ్బుక్రమ్మి కనుల కొకవిధమగు నాటకరంగ సీమగా గనపట్టుచున్నయది అహ్హా! యంచుదరలేని యీవనమును వనధిలోఁ బోల్పవచ్చును. ఎట్లన?

సీ. అలఘు పచ్చికచేత ♦ వలరారెడి నేల, నిర్మలసలిలంబు ♦ నెరిగదనరె
గాలివీచినయప్డు ♦ వాలి పైకినిలేచు, శాఖలెన్న తరంగ ♦ సరణి తనరె
విరియబూసినచెల్లు ♦ వరి, యటుకటునుంట, నోడల తెరచాప ♦ లోజదనరె
వలికి క్రిందికిపైకి ♦ చెలరేఁగుపుష్పముల్, మిలుదన్ను కెగురు ప ♦ క్షులుగదనరె
తే. గీ. అచ్చటచ్చట విరిగుంపు ♦ లలరుచుంట
నురుఁగ తెట్టులగతిఁ దోచె ♦ నరిదిగాను
వంమ దరిలేని యీవన ♦ మద్భుతముగ
వనధివలెతోఁచు చూచెడి ♦ వారికకట

(మింటిదెస విలోకించి) బళే! అప్పుడే చంద్రోదయమైనది. నీలమేఘచ్ఛాయతోఁగూడిన యాకసమం దాచంద్రుఁడు మధ్యమధ్య మేఘములతెఱపిని గన్పడుటయు మరలఁ గప్పఁబడుటయు విలోకింపగాఁ గ్రొత్తగా గాపురమునకేతెంచిన పడుచు తన భర్తనజూచ నభిలాషతోఁ గెంజాయనయనుండి తొంగిచూచుపగిదిగాఁ గనుపట్టు

చుండె. ఈ చల్లగాలికి ప్రాణము లేదివచ్చినటు లుండెకాఁబోలు జంతుసంతానము తమ తమ సంతోషమును వెల్లడించుచుండెననుటకు—

కరిబృంహితవృత్తము.

కోకాకోకని నిల్చి కోమలను ♦ కూఁత కెరలెడు కోకిలల్
పీఁకఁగోని పురివిప్పి నటనము ♦ వింతసలిపెడు కేకులున్
గోఁకలును మొదలెత్తి నకనక ♦ దూఁకు నడరెడి జింకలున్
సోక కొలిచెడుచూడ మానిని ♦ చోద్యమయి కనుపట్టెగా

కాని యిప్పుడు నా చక్కని నా చక్కని బొమ్మ, యా రెక్కల కొమ్మయగు బకావలియే యున్నపక్షమున నీవనము వైకుంఠముగాను, నీచల్లగాలి యమృతోపమానముగాను నుండకుండునా? యెప్పటికో నా కాభాగ్యము లభించుట.

[అంతట ఓంకారధ్వనులతో స్త్రీలతో మోయఁబడు పల్లకి ప్రవేశించును]

సదా—(విలోకించి) ఆహా! యిదియేమి వింత?

తే. గీ. వందలకొలంది సౌందర్య ♦ వగులు స్త్రీలు
నడుమ జల్తారు పటకాల ♦ నానికొలువ
యుంచను లాంద్లోళికంబు నో ♦ హో యటంచు
మోయుచున్నంగ కలనందు ♦ పొలఁతియగును

(కొంచె విటునటు వంగిచూచి) ఆహా! దర్శనమైనది.

తే. గీ. ప్రళయ కాలంబునందలి ♦ భానుపగిది
మించి వెలుఁగొందె శిరముపై ♦ మంచి ముత్తె
ములమకుటంబు తొలకాడ ♦ హస్తమందు
ఖడ్గమునుదాల్చి కూర్చున్న ♦ కలికిమిన్న
గవ పదారేండ్లు వయసుగా ♦ గానుపించె

వినోదవల్లి వచించినతీరుగా నీస్త్రీల ముస్తీబు నెంచ బకావలీ దాసీజనంబులగతిగా నుండిరి. అందుచే నందున్న మందయాన బకావలీయై యుండదుకఁదా? ఆహా నాకంత భాగ్యమా? అదికాదు మున్ను మిన్నుపై బకావలినిచూపి మోసగించిన మాయామోహిని కాదుకఁదా? ఇంకను నాపైఁ బాళింపుజాలక నిట్టివేషముతో నరుదెంచుచున్నయది కాఁబోలు. నేను మంత్రపఠన మొనర్చుచు బహు జాగ్రత్తగా గూర్చుండెద. నన్నేమిచేయఁగలదో చూచెదనుగాక. (అని నిశ్చలముగా గూర్చుండును)

(ఓంకారధ్వనులతోఁ బల్లకి యాతని కెదురుగా దింపఁబడును)

1 చెలి—ఆశ్చర్య మాశ్చర్యము.

మత్త. అయ్యయో! యిదియేమి? వృక్షము ♦ లందుఁ జంద్రుఁడుపుట్టెగా
2 చెలి—(చూచు టభినయించి)
అయ్యదేమిటి? చెట్లలో రవి ♦ హస్తమింపఁగఁ జొచ్చెగా
3 చెలి—(చూచి తలపంకించి చిటికలువైచుచు)
అయ్యరే! యుదయించె శాఖల ♦ నందుచక్కనిచుక్కపో
4 చెలి—(కొంచెము నిదానించి దరిచేరి)
అయ్యొ! మానవులందు భూషణ ♦ మంచు నామది నెంతు నే

కమాచిరాగము—రూపకతాళము

1 చెలి—కనులుపల్లవ బఱచుకొన—గల్గెనెంచితి మేనియున్
2 చెలి—కనులపండువగాను గాంతము—కడకుచేరటు పోయిగా
3 చెలి—అవును మనమటు చేసితేనియు—అవనిపై మనజన్మమిం
4 చెలి—కవుకఁదే యది సార్థకంబగు—అబ్జలోచన! తప్పకన్
(పల్లకిలోనుండియె)

మోహి—చెలియలార! అదేమి మీలో—చెలఁగి పలుకుచునుంటి రే
తెలియఁబల్కక రాద టె యది—యిలనేమిచిత్రమొ వేగమే

1 చెలి—అమ్మా! మనమెప్పుడును వచ్చుచు పోవుచుండెడి మార్గమేకఁదా? యిన్న డిట్టి వింత కనియుండలేదు.
2 చెలి—ఇక్కడొక దివ్యతేజము ప్రకాశించుచున్నయది.
3 చెలి—ఆ దివ్యతేజ మొక బాలసింగ మాకారముగా నున్నయది.
4 చెలి—అమ్మా! మేమేమి వచించినను నతిశయోక్తిగా నుండును.

1 చెలి—సీ. ముఖకళకబ్జారి ♦ సఖమైకళలువాసె
కరమంటఫలమిదు ♦ కల్పకలత
2 చెలి— వెండిపీటనుగూడ ♦ వెక్కిరించెడునొసల్
వెనదపతుమా లక్ష్మి ♦ వీడుపట్టు
3 చెలి— మంచిముత్యపుచిప్ప ♦ లంచెంచనౌకనల్
చూపు లాకసమంటు ♦ తూపులగమి
4 చెలి— దంత కాంతికిముత్య ♦ తతినీరు విడచుగా
వాక్య మమృతతుల్య ♦ పదవియగును

1 చెలి—దేవా! మా చెలి యగు మోహిని గాన్ధర్వగణములకు ముఖ్యప్రదేశమైన నాగపుర ప్రభుని కూఁతురు. కావున మీయిరువుర జోడు బాగుగా కుదిరినది.

సదా—ఆహా! అలాగునా? నాప్రక్కను మీ చెలి కూర్చుండెనకదా యీడుజోడు సరిపోయినది లేనిది తెలియునట.

2 చెలి—అమ్మా! చూచితివా? అమ్మహానుభావుని చమత్కార ప్రసంగము.

మోహి—ఆయన కంత మక్కువ నాపై నతి సూక్ష్మముగా జనించినప్పుడేల నేనాయన ప్రక్కను గూర్చుండఁ గూడదు. అటులనే కానిచ్చెద.

(అని సదానందుని ప్రక్కను గూర్చుండును)

3 చెలి—ఆర్యా! పాంథవరా! మీ కతెంతకయినను ప్రముఖులే. లేకున్న మా చెలి పూర్వపు పరిచయురాలువలె, రక్తసంబంధ బాంధవ్య మగు మేనయత్త కుతురువలె, వచ్చి మీ చెంత నేలఁ గూర్చుండును?

కం. ఎక్కడ గుఱ్ఱము లేదుగ, నొక్కటి వీ సాయమెవ్వ ♦ రుండక యే య
ట్లక్కా! కుటీరమునుండియు, గ్రక్కున సౌధంబులోని ♦ కలఁగనె యహో!

4 చెలి—చెలీ! మోహినీ! ఈపధికుని నెంచఁగా:—

చ. ఇతఁడొక భూతవైద్యుఁడని ♦ యెంతయు నెన్నఁగ వచ్చు లేనిచోఁ
జటువతగా మిముఁ జరిచె ♦ చక్కఁగ వల్వను గానపల్లిలో
కతులిత సుందరాంగుఁడు మ ♦ హాద్భుత వస్త్రవు సుందరంబు, నా
గ్రతనుఁడి బుట్టఁబెట్టు దన ♦ రాణయునే గనుఁగొని మిమ్ములన్

సదా—నన్ను మీరలు బుట్టఁబెట్టుకున్న మిమ్ములను నే పెట్టినంతఫలము.

మోహి—మీరిదివరలో భంగపడియుంటిరా యేమి?

సదా—ఓహో!!

మోహి—ఎవరివల్లను?

సదా—నీయట్టిదియే. నీకంటె "మాయ" యను రెండక్షరము లా నామమందు కలవు.

మోహి—అమ్మయ్యో! మాయామోహిని యను కట్టుబోతుదానిచేతనా?

1 చెలి—ఓహో! అదియా! అదియముచేతనే కాంబోలు మమ్ములను గూడ పిశాచముల క్రింద పోల్చితిరి.

2 చెలి—అది మహామంత్రవేత్త. మీరెటుల తప్పించుకొని యేతెంచితిరో తెలియదు.

3 చెలి—దానిబారినుండి బయటఁబడుట దిరుగ పునర్జన్మ మెత్తుటయే!

4 చెలి—దానిని జయించుట ముజ్జగములు జయించుటయే.

సదా—అంతికంటె శేయించుటల మంత్రసామగ్ర్యము నాచెంతకలదు. అందులకు సాక్షి యిదిగో నాదండమునఁ గట్టఁబడిన "వశీకరణమాని" యను రక్షాబంధమే.

(అని చూపును)

మోహి—ఆరక్షేత్రమే దానికి దిక్కువేసి తప్పించుకొని వచ్చితిరా!

1 చెలి—మహాత్మా! అరక్షు మా మృగాక్షియెడల వినియోగింపకుఁడు.

2 చెలి—మహాశయా! తమపేరేమి?

సదా—"సదానందశ్రేష్ఠి" అని యందురు.

3 చెలి—రూపమునకుఁ దగినపేరే.

మోహి—మీజన్మస్థానము?

సదా—కాన్పుట్టము లేక కలకట్టు "కల" యనగా లావణ్యము "కట్టు" యన గుంపు. అనఁగా లావణ్యరాశి యని భావము. అందమనే ముగ్గులో మాపట్టణము నిర్మింపఁబడి యున్నది.

4 చెలి—మీపట్టణమే కాదు మిమ్ములను గూడ భగవానుఁడటులనే నిర్మించి యుండెనోపు.

మోహి—మహాభాగా! మీరలు వంగదేశస్థులమని సెలవిచ్చియుంటిరి. సిరిచేతనా తులఁదూఁగుచుంటిరి. మీరలు వివాహవిహీనులని కూడా మీ యజ్ఞోపవీతములే తెల్పుచున్నయవి. సౌందర్యమునకా నిధి. అట్టివార లెందులకై సహాయము లేక నీకర్కశశిలావృతంబగు కాంతారమున కేతెంచితిరి? మీకు కావలసిన దేమి యున్నది?

సదా—అబ్బా! చంపితివే. యీప్రశ్నకేమి సమాధానము చెప్పను. వరునకు తృప్తి యనునది లేకపోవుటచేఁ గలిగిన యరణ్యావాసమని యెంచుము.

తే. గీ. పొలఁతి! ఆయాశమొండొకఁ ◆ బుట్టినాఁడ
లేను! నాయదృష్టము తల ◆ క్రిందుగయ్యె
వాలుగంటి! నామది బాధ ◆ పత్తఁగజొచ్చె
కనుక వేఁడొక ప్రస్తావ ◆ మునకు గడఁగు

అది యటుండనిమ్ము.

ఉ. ఎందున నుంటివో తెలియ ◆ దే, పదిమందిలో నున్న నీజగం
బందున నాకు సౌఖ్యమిడు ◆ వారలు లేరొక రాత్రికైన నే

ఉ. అంతములేని మోహమను ♦ నద్భుతమైన "పిశాచ" మెన్న మూ
ర్ధాంతమునందు నిల్చి మిగు ♦ లంధములోనికి నీడ్చె జ్ఞానమా
ద్యంతము నున్న జ్యోతి సర ♦ సాంధములోనికి, దానిచేత వే
దాంత మయాంతరంగము స్మ ♦ రాంతకునంబుగ మారె మిత్రమా

దీనికిఁ గారకులు మీరలు. మీకు నే శరణార్థినైతిని. క్షత్రియులకు శరణార్థిని గాపాడుటవశ్యముకదా. మాత్రముగాని నిశితసాధుక పంక్తిచే నంతమునొందనున్న నా జీవములను గాపాడుట మీవంతయి యున్నయది. ఎటుల రక్షించెదరో మీయదియే భారము. ఉత్తమక్షత్రియోత్తములు మస్తకాశని నగు నే నింతకంటె లజ్జ త్యజించి పలికింపవలసిన దేమున్నది? (అని పాదములపైఁ బడును)

సదా—(స్వగతముగ) అహో! పరమేశ్వరా! యిదేమి? నే వచ్చినకార్య మొకఁటి దైవసంకల్ప మొకఁటి యగుచున్నది. మాయామోహినిబారినుండి తప్పించుకొంటిని గాని యీ మోహినీ నిర్బంధమునుండి తప్పించుకొనుట దుస్తరమే. అది యింద్రజాలకుని కూతురు. ఈమె భూపేంద్రుని పుత్రి. అది మాయలమారి. ఈమె న్యాయవర్తన చూపట్టుటకు దారి. అది కురూపి. ఈమె సురూపి. వీరలిద్దరకు మశకమునకు మదగజమునకు గల వ్యత్యాసమో యంత వ్యత్యాసము కలదు. ఇంతయేటికి? ఈమె నాతో సమానమైన మహారాజకుమార్తె. ఈమెతోఁ బెండ్లి నాకెల్లవిధముల కల్గియే. కాని కొంతవఱకు విరక్తిమార్గమును బోధించి చూచెదఁగాక. (ప్రకాశముగ) చెలీ! ఎంత చేలువు? నీయట్టి వారివలననే స్త్రీలకు "చేల గోల" యను శబ్దములు జనింపఁబడినవి. లే లెమ్ము నాచెంగటఁ గూర్చుండి నా హితోపదేశము వీనులందు జొనిపుము (అని లేవఁదీసి దగ్గఱగాఁ గూర్చుండఁ బెట్టుకొని) సఖీ! యిదియేమి వెఱ్ఱితనము?

ఉ. నీమది పాపయుం దవిలి ♦ నిన్నిటు మోహపు వార్ధిలోనికిన్
ద్రేమగ ద్రోసెనో యటులె ♦ ప్రేయసి! నామది యా బకావళీ
ప్రేమమునందు డించి నిను ♦ జేచిన మోహపిశాచమే ననున్
గామకుఁగా దొనర్చె ఘన ♦ కానకుఁ జేర్చుట నీ వెఱుంగవే.

అట్టివాఁడనైన నేను ప్రప్రథమమున నింటలకై సర్వస్వము త్యజించి బయలు వెడలితినో యది సఫలముకానిదే వేరొండు దానికై యత్నింపను. ఒకానొకవేళ నీ బలవంతముచే నంగీకరించితిని నా తలంపావలంబిపై నుండుటచే రేఁపే యిలు వెడలి పోయెదను. అందువలన నేమిప్రయోజనము. ప్రతిమా చెడును సుఖమూ దక్కదు.

ఉ. బాగుగనెంచు నీమదిని ♦ బల్మిని మన్మథకేళికై రయిన్
లాగిన లాభమేమి? ప్రగ ♦ నాశము సర్వసుఖంబు, క్షేపు నే

సదా— వనితా! యిట్టుల వగవ నేల ♦ గొనవె యూర్మిక చెప్పగా
నిను గాఢముగా—నమ్మకముగా—దయసేయుగా.

(అని లేచి చేసి తన యంగుళీయము మోహినీ హస్తమున నుంచి) సఖీ! నిన్నిప్పుడే జాయగా బరిగ్రహించితి వినుము:—

ఉ. మంగళసూత్రధారణకు ♦ మారుగ నంగుళియందు నీకు నా
యంగుళిముద్ర నుంచితి ప్రి ♦ యాంగన గానివట్టు లాన నా
లింగన! యా బకావళి స ♦ మాగమ మబ్బిన నద్దినంబె నా
కౌంగిట వాయివోయిక సు ♦ ఖాస్పద కేళిని నొందెదే సుమా

ఇందుల కన్యథా చరింతునేని మజ్జనని జనకుల పాదముల యాన. కార్యదీక్షనుబట్టి నీతో సంతసముకు చెల్మికి వీలులేదని బతిమాలుచుంటిని.

మోహి—(ప్రసన్నవదనయై) మహాభాగా! అంతకే సంతసించెదను. కార్యాశక్తుల కట్టి దీక్ష లేకుండిన ఫలరహితులు కారుగదా? నేనుమాత్ర మంతజ్ఞాన శూన్యురాలనా? కావని కత్తిపీటను కాలుగోసుకుందునా?

ఉ. మోహముగల్గియున్నపుడు ♦ పూరుషుడాడిన పల్కులందు, వ్యా
మోహముగల్గియున్న పుడు ♦ బోడికి నమ్మిక తీరకుండు, నో
బాహుబలాఢ్య! మీ పలుకు ♦ పక్షమునందులు కాదు కావునన్
సాహససముద్రమధ్యమున ♦ ముక్తి మునుంగుదు నిక్క మిత్తరిన్

కావున విధిగా బదునైదు దినంబులలో గొనిపోవుదువని చేత జెయివేయుడు.

(అని తనచేతిని సాచును)

సదా—(మోహిని హస్తమును బట్టుకొని) సఖీ! ఎన్నిదినంబులకు బకావళీ వివాహము చేయగలను?

మోహి—ఎన్నియో దినములా? లెక్క నాలుగు దినంబులు.

సదా—అయిననో వన్నిదినంబుల గడువే యక్కరలేదు. ఏమో దారిలో నేమి యవాంతరములు సంభవించునో? అందుచే సంతసముకు గనుపుంచితివి.

ఉ. లక్షలికేల నొక్కమడి ♦ లక్ష్యముగా మదినుంచు చేనిదే
పక్షములోన వచ్చి నిను ♦ భావజులీలల దేల్చి మీద సం
రక్షకులైన తండ్రి తలి ♦ ప్రాపునకున్ గొనిపోక యున్న న
బ్జాక్షిరో! నాదువంశ ఘన ♦ వార విపాదములాన నమ్ముమా

(అని చేత జెయివైచి) ఇది రెండవసారి ప్రమాణికము.

మోహి—ఆనంద మానందము.

సదా—చెలీ! అల్లదే పశ్చిమదిశ విలోకింపుము.

మోహి—(యూమ టభివయించి) మహాత్మా! తెలిసినది.

ఉ. మనమొక మోహవార్ధిఁబడి ♦ మైకమెుంగక నోలలాడ, నా
మ్మనమున నోర్వఁజాలక క్ర ♦ మంబుగ స్థానమువాసి, పోవు వి
న్ననవ, విదగ్ధనా ద్యుతిని ♦ నార, వనుంగులు తారకా సఖీ
గణము త్యజించి, వార్ధిఁబడె ♦ కాంచితె చిత్రము! యోగవర్ధినీ

సదా—సఖీ! చేతగానివారల కృత్యమే యట్యది. తెల్లవారుచున్నది జాగేల? ప్రయాణసన్నాహముమీఁద నుండవలెను కదా.

మోహి—దేవా! చిత్తము. ఇక్కడికి కనతిదూరమునందే రాజఋషులు వసించెడి యుద్యానవనము కలదు. వారలను దర్శించి వెడలఁగలందులకు ప్రార్థన.

సదా—ప్రియా! మంచిది. పెద్దల దర్శనము సర్వవిఘ్నముల బాధకముకదా! నీవు మార్గము చూపుట్టుము. వెంటనంటుగుదెంచెద.

మోహి—చిత్తము. (ఇర్వురు నిష్క్రమింతురు)

(యవనిక జారును)

---

## తృతీయాంకము



జగదేకదేవుని యుద్యానవనము.

[జగదేకదేవుఁడు సమాధియందు జపముసల్పుకొనుచుండగా
సదానందదేవుఁడు మోహినితోఁ బ్రవేశించును]

మోహి—దేవా! నిష్ఠాగరిష్ఠుఁడై సమాధియందు గూర్చొని జపమాచరించుకొనుచున్న నా రాజఋషియే మజ్జనకుండు.

సదా—చెలీ! ఇట్టి మహనీయమూర్తిని దర్శించుటవలన నా జన్మ తరించినది. అంతియకాక నా కార్యము సఫలీకృతమైనట్లుకూడ కన్పట్టుచున్నయది.

జగ—(కనులువిప్పి చూచును)

మోహి—జనకా! యిదే నమస్కారము!

సదా—మామా! యిదే వందనము.

జగ—స్వస్తి. రాకుమారా! దివ్యదృష్టిగలవ సకల మెఱింగితిని. ఇదివఱలో నా పుత్రిక వివాహ మంగీకరింపక తిరస్కారభావమై కన్యాత్వముతో నుండి తుదకు

మంచి పనిని ఉపదేశించుటకు కారణముగా నున్నయది. మీ బుద్ధిచాతుర్య మత్యాశ్చర్యక
ముగా నున్నయది. ఏమంటిరా?

ఉ. రోగముచేత బాధపడు ♦ రోగిని జూచి భయంబులేనుగా
బాగగునంచు ధైర్యముగ ♦ వైద్యుఁడు పల్కఁగ సంతసించెడా
లాగున మోహవశ్యులగు ♦ రాజముఖుల్ గని వార్ల ప్రేయసుల్
బాగుగ నూఱడింప నగు ♦ నంది విచారము వాసి యుందురా.

సదా—రాజఋషివర్యా! ప్రస్తుతి మంతకన్న నవకాశ మేదియును లేదు.

ఉ. ఈరహి మీరువల్కు మన ♦ వేమని చేయుదు, మోహశక్తి కా
గారము వీడి వచ్చితిని ♦ కాన, క త్రైర్యునిగా దలంతు మా
వారలు, పైగ నన్నవృతి ♦ వాదిని యంత్రా, తలంచు కార్యముల్
వేరుగనెంచి మర్త్య పద ♦ విల్ బ్రమదాబ్ధిని సోలలాడుచోల్

జగ—అవు నామాటనిశ్చయమే.

మోహి—తండ్రీ! మీయల్లుఁడు బకావళీ శుకవాణి నిమిత్తమై చిత్తమందల మందరి కిమ్మాలుఁ రాజ్యమున కేగుచున్నవాఁడు. ఏ యాపాటము కలుగకుండ నిరాటంకముగా ఒదువైదు దివసంబులలో సతీసమేతుఁడుగా వచ్చుచుండులాగున దీవించి పంపఁ గంధములకుఁ బ్రార్థన.

జగ—అమ్మా! మంచిది. రాజపుత్రా! నీ వప్రతిమానుఁడవు కావున నీ ముఖలక్షణమే సూచించుచున్నయది. నీవు తిరుగ బకావళీసహితముగా నీవనము జొచ్చి నాకూఁతును రాజ్యలక్ష్మిని గ్రహించి వెవలఁగలందులకుఁ గోరుచున్నాఁడ.

(ఒక చిన్న బిల్లను జూపి) కుమారా!

చ. ఇదియొక ప్రశ్న బిల్ల ధర ♦ ణీధవ! నీవు తలంచు కార్య మే
యదియగుగాక దాని ఫలి ♦ తార్థము రేఖవమూవకంబుగా
నాదవును దీనిపై నదియు ♦ యొప్పుగ జూచుచు నాప్రకారముల్
వదలకొనర్తు వేని ఫల ♦ భాగ్యము లభ్యము తప్పకుండగాన్

(అని సదానందున కొసంగి) బహు జాగ్రతగా గుప్తపఱచుము. నీవు నాకూఁతునకుఁ బ్రాణప్రియుఁడ వగుటచే నాకును ప్రాణసమానుఁడవే కావున ప్రాణప్రదమైన యీప్రశ్నబిల్లను నీకొసంగితిని. నీప్రాణమట్టుల దానిని భద్రపఱచిన నీకెంతయు నా లాభమే యగు.

సదా—(వినయముగా నందుకొని) మహాత్మా! మహాప్రసాదము. నాకు సెలవొసంగుఁడు. ఇదే నమస్కారము. (అని నమస్కరించును)

సాధు — (సదానందుని శిరముపై హస్తముంచి) స్వస్తి వత్సా! భయంబులేదు. శాదిక స్వస్తిని విలోకించితిని. కార్యకర్తృత్వుండవయి యొకపక్షములో నీ శెంచి మమ్ములను సంతోషపెట్టగలవని తెలియుచున్నది. అమ్మా! ధైర్యముతో పొగ సంప్రము. కుమారా! మరల జపనిష్ఠకై సమాధియందు గూర్చుండెద. (అటు లొనరించును)

(మోహిని సదానందుడును కొంచెము దూరము వత్తురు)

మోహి — ప్రియా! మీ రాప్రశ్న బల్లపై బకావలి చిక్కునది లేనిది ప్రశ్న చూడుడు.

సదా — చెలీ! మంచిమాట చెప్పితివి. అంతిమార్గమేగి యష్టకష్టములు పడి తుద కామదేశగామినిని బహుయాతెక సుఖించుటకంటె యీప్రశ్న బల్లపై చిక్కుదా దక్కునాంగియని ప్రశ్నయిచ్చిన నింక నాయిక్కడు వెదలక, నీవిక్కడనే యుండి సుఖించుటమేలు. (అని నిమీలితలోచనుండై ప్రశ్న బల్లను తీసి) సఖీ! యిందుపై వ్రాయంబడియున్న జవాబు నీవే చదువుము.

మోహి — చిత్తము. (అని యీక్రిందిప్రకారము చదువును)

పాటప. ఈవు బకావలి యిక్కడ రాజా ♦ పోవగనా నలుపూటలలోన
జీవను నొప్పుచు జెచ్చెర దానిన్ ♦ నీవిగనొందవె నవలీలన్

(సంతోషముతో) ప్రియా! నన్ను మఱచెదరా యేమి?

సదా — అసంగతిని గూర్చి ప్రశ్నించవా యేమి?

మోహి — అటులనే కానిండు.

సదా — ఓప్రశ్నఫలకమా! నేను మోహినిని తీసుకొని వెడలెదనా లేదా? నాతలిదండ్రులను గాంచెదనా లేదా? రాజ్యభారము పూనుదునా లేదా? (అని నిమీలితలోచనుడై తియ్యక పలకగాంచి) సఖీ! నీపని పట్టెను. నిన్ను మానిచెదనట. మరలి ప్రాంతము త్రొక్కమానవలెనట. ఇదిగో! బలపముపైగల వ్రాతను జదువుకొమ్ము. నేనబద్ధమాడితినని లేనిది తెలియంగలదు. (అని మోహింపువానివలె నటించి దాచును)

మోహి — (అతురతతో) ప్రియా! నాకు చూపవా? నిక్కముగా నటులనే వ్రాసియున్న నీకోఅకంత కాలము వేదియుండనేల? యిప్పుడే యీగుణ్ణుడు ప్రాణములు నీపాదారవిందముల చక్కని త్యజించిన ఉన్నదె బూడ్డె చేసి మెమెలెదవు. పతి ప్రతకు పతిచేతిలో గతించుటకన్న పుణ్యమేమి?

సదా — (చిఱునగవుతో) అయ్యో! వెర్రివానా! ఎంతమాట. పరిహాసమున కంటిని గాని దీనిపై వ్రాతను జదువుకొమ్ము. (అని చూపును)

మోహి — (మోము టక్కెనవంచి సవిలోపముతో)

మత్తకోకిల. పదియాఱేడవఱేఁ జనంగున ♦ పద్మనేత్రను మేపినిట్
ముదమెలర్పఁగ గాంచి యారెయి ♦ హేమమార్గిని తేల్చి, యా
కిదప నామె బకావళింగొని ♦ వెళ్ళినీను రాజ్యమిం
పొదవ ముఖ్యర స్త్రీలతోఁ జను ♦ లుత్సహింపఁగ నేలెదో

సదా—చెలీ! మోహిని (అని వీపుతట్టి) ఇప్పుడు నీమనస్సంతోషముగా నున్నదా? ఇంక నాకు వెడల నానతిమ్ము.

మోహి—చిత్తము. కొంతవఱకు సాగనంపెద.

సదా—మంచిది.

(ఇద్దరు నిష్క్రమింతురు)

(తెఱచీరపడును)

---

శ్రీరస్తు

# బంగన్ బకావలి



అను

## భువనమోహిని

## చతుర్థాంకము



### ప్రథమరంగము

[ప్రదేశము. బఙ్గన్ రాజ్య ప్రాంతమందలి యెడారి—అందొక గొప్ప యగ్నికోట]

[ప్రవేశము సదానందదేవుఁడు కొంతదూరములో]

సదా—అహా! నేను మోహినీసతిని విడిచి నేటికి నాలుగుదినము లైనవి. అచ్చట ప్రశ్నించు బల్లపై జరుగ్గదివసంబున తప్పక బకావలీ కోకస్తని సమాగమము కలుగునని ప్రశ్న వచ్చినది. ఏది? యెక్కడ బకావలి? ఎక్కడిసమాచారము? (అని కొంచెము ముందుకేగి యిటునటుఁ జూచుటభినయించి) ఓహో! బలారె! భళిరా!

చ. ఇదిగద చెట్లు చేమలొక • యించుకలేని ఎడారియయ్యె నిం
దొక మహాగ్ని గోళ మది • యుర్వికి నింగికి నొక్క జ్వాలయై
పొదవె స్ఫులింగముల్ చెదర • బోరున మండుచు నగ్నికోటగా
నొదవిన భంగి కన్పడెన • హో! యిదియేమి విచిత్రమో కదా?

మహాసముద్రమందు బడబాగ్ని జనించునట్లీ యెడారియందు మహాగ్ని పుట్టి ప్రజ్వరిల్లు చున్నయది. ఇందింతవంట బయలు వెడలుటకుఁ దగిన చెట్లు చేమలా లేవు. కట్టెగాద మంతకన్న లేదు. ఇదేమి వైచిత్ర్యము. (అని నిలుచుంబడును)

[అంతట నామంటనుండి యొకలేడి వచ్చి యాడుచుండును]

సదా—(విలోకించి) ఇది మరీ తమాషగా నున్నయది.

పంచ. బలాబలా తరంగములు • బాడబాగ్నినుండి చ
ల్బలాకిగాను దూఁకుచున్ గు • లాసగాను గంతులన్

ప్రాణపణంబు గామటకు ♦ ప్రత్యుపకార మొనర్పఁ దేని నీ
మానధనంబొసంగి ప్రియ ♦ మానిసి గాననఁ జెలంగొమ్మికన్

(అని కడ్డము పట్టఁబోవును)

బలి.—(కొంచెము వెనుకకు తగ్గి) ఓహో! రాజవరా! ఇదేమి పాపము! ఎంత వారించినను మీరు కేగుచుంటిరి? మిమ్ము నే పిలచి పీటలు వేసి యీపని మీరలు చేయవలయు నని ప్రార్థించితినా? అర్థించితినా? వినుఁడు మీపనులె నా కానొకఁడొక వృత్తాంతము వింటిరేని:—

ఉ. మీరలు పిల్వకుండినను ♦ మిక్కిలి చెయ్యతిథించు ముందు నా
హారము మెక్కి పంక్తి నెలవ ♦ టందున గూర్చొని తీరు మీదు క్రొం
గారపు చేత లట్టోడవె ♦ కాని మిఠాయిని గాంచినంత నో
రూరిన లాభమేమి? తిన ♦ నోప్పను నోరు లభింప కుండినన్

సదా.—(చిఱునవ్వుతో) చెలీ! పిలువని పేరంటమునకు వెడలువారి యందెంత సరసమున్నదో గ్రహించితివా? పదార్థము దాశక్తి గలవానికి పిలుపుతో బని లేదు. పిలిచిన పిలుపుపై వెడలిన నందు సరసమే లేదు. ఎందుచేతనంటివా? పిలిచిన వారలు పెట్టకుందురా యను నిర్లక్ష్య భావముతో నాతఁడుండును. ఇఁక పిలువని వాని సంగతియందు వేమో? యింతియో యిచ్చగలవాఁడు గాని పిలువకుండగా వెడలనే వెడలఁడు. అలాగున వెడలిన వాఁడెప్పుడు నాతురిమును జెందుచు తనదగ్గర కాపదార్థము వచ్చునా లేదా యను భయముతో ముందున కేగ దారి నపూర్వింప నభిలాషతో బెనంగులాడును అదియే యొకవిధమైన సరసము, అందము. "రానివారలకు పిలువ లేదుక, బోడితల నంటవేదుక" యను సామెత తెలియంగదా? అది యటు లుండ నిమ్ము. పిలిచియు పిలువని వారల స్నేహ మభిలషించినగతి రాకయు వచ్చినటుల కానిపించువాటి యందమితమైన కోరిక యుండును. ఎటులంటివా?:—

ఉ. రాకనునుండి వచ్చియును ♦ గావటపుటాఁడిన వాని మీఁద నం
దేఁకటు, వచ్చి బైలుపడి ♦ యేకడఁ జూచిన తా మెయూ పదా
ర్థాకరమం దపేక్షొదవ ♦ దారిన నివ్వము రానిదానికై
యేఁకరి యేక రేఁకరయి ♦ నీల్గుచు నొందఁగలేని బెంగచేన్

సఖీ! మిఠాయిని గాంచినంతనె లాభమేమి? తినుటకుఁ దగిన నోరుండవలె నదికదా యనుచుంటివి దాని సంగతి వినుము:—

తే. గీ. చెలి! మిఠాయి యను పెంత నీ ♦ తెలియక నను
మనుభవింపంగ నోర నే ♦ యాపదంబు

కలిగియుంటివి నీకది ◆ తెలియదేమి
సరసురాలవే యైన నా ◆ కరము గొనుము

బకా—దేవా! నీతోఁ జెలిమి యొనర్పుటన్న నేసరసమెఱుంగని దానినే నా?

సదా—ఓహో! విధాయికముగ. ఇంకా విప్పి చెప్పవలెనా? వినినదానికి జూచినదానికి సహస్రము వ్యత్యాసము కలదు.

బకా—అదేమిటి? ఎవరివల్లను వింటిరి.

సదా—వినుటలోను చెవులు చిల్లులు వోయినవి. చెప్పె దాలింపుము.

చ. అవును! బకావలీ సతి మ ◆ హా జగజంత, మొయారి, మేల్బళీ
యనఁదగు రూపు, బల్ సగస ◆ కందున వందిన చేయి యందు నా
యనుఁగు వినోదవల్లి యెస ◆ లాగతి వింటిని, కాని కంటి నీ
పావయకు దగ్గసత్సగస ◆ మొక్కటి లేదని నిక్కువంబుగాఁ

బకా—మీ వినోదవల్లి వచించిన సౌందర్యాదిక్రియ లుండగా నాయందు రసజ్ఞత లేదని యెట్లు నిర్ధారణ యొనర్చితిరి?

సదా—అది కూడా వెల్లడించుమనియెదవా? వినవో వినుము. ఒక్కమాయ రక్కసి చిక్కములో బిగియించి నెక్కొని తన మాయలచే వచ్చువారిని జక్కడంచు చుండ నక్కసిదియొక్కడును భీతిచే నెదిరింపలేక దటస్థముగా నూరకొని యుండ నిక్కాననమునకా తెక్కలి కాముకొనివచ్చి నిన్ను చిక్కులు పెట్టుతలంపుతో నుండ నా క్రూరుక్కడిని జక్కడించి యమచక్కి వారినుండి నిన్ను రక్షించిన యుక్కిడీడను. అట్టి మహోపకారుఁడనగు నన్ను తృణీకరించుటయందేమి సరసమున్నది? పైగా నేనొక చక్రవర్తి కుమారుఁడనని యెఱింగి యుండి నాకొక గ్రామము ఒసఁగుమని నిప్పింతు వంటివి. అందేమి సరసమున్నది? కాక సర్వమును త్యజించి నీకై వనముల జొచ్చి నా ప్రాణములకైన పాటింపక నీప్రాణము గాపాడిన ప్రాణదాతనగు నన్ను వరింపక కరంబు త్రోసిపుచ్చుటయం దేమి సరసమున్నది? పోనీ సౌందర్యమున కంటివా! వలంతలలో నీవెంతస్తుతికి పాత్రురాలవో పూరుషులలో నేనంత నుతికి పాత్రుఁడనైతిని. అట్టి సంగతి కనులారా నన్ను గాంచి మన్నలేక మిన్నక దోసి రాజనుట యందేమి సరసమున్నది? అది యటుండనిమ్ము. ఈడు జోడున కంటివా! మన యిర్వుర మొక్క జోడాగా నుంటిమి. స్త్రీపూరుషుల మనుటేగా తక్క రూపలావణ్యవయసులం దొక సమానముగా త్రాసున వైచిన తులఁదూగుదుము. అట్టి వానిని నిరసించుట యందేమి సరసమున్నది. స్థితిగతులకంటివా? నేనొక చక్రవర్తి పుత్రుఁడను నీవు నబాబు కూఁతువు. అట్టివాఁడనగు నా చెట్టపట్ట కన్యకా తలంచు

లేమిసరసమున్నది? ఇంక దిట్టతనమునకు నొకటి వినుము. గోమాంసాశనులగు మీతురుష్కజాతితో మహారాజవంశంబున జనించిన యుత్తమ క్షత్రియుండగు హిందువు నిన్ను గోర తిరస్కరింప పరిభవింప నందేమి సరసమున్నది? ఛీ! దూది పింజకంటెను నతి సులభముగా నన్నెగురగొట్టుచుంటివే యిది మీ స్త్రీజాతికుండం బడిన స్వభావమా? లేక నీనైజమా? అహా!

తరల. అతివ లెప్పుడు మాటకారుల ♦ కింకివారల వశ్యలై
నతియొనర్చుచు ప్రాణమాన ధ ♦ నంబు లర్పణచేసి సం
గతి యెఱుంగక దాసురాండ్రయి ♦ గడ్పుచుందురు కాలముల్
స్థితిమతుల్ కద డాబులేమిని ♦ స్త్రీలు వారలఁ జేరరో

అనగా నీ ప్రపంచమంతయు డాంబికమయమై యున్నయది. అట్టిది కాకడ లేనిది యగుటచే నేనెంత ఘనుఁడనైన నేమి రాజకుమారుఁడనైన నేమి? నీయుంగల సెందములకును బనికిరామంటిని. పోనిమ్ము. నన్ను ప్రేమింపకుండిన చెంగలేదు కాని నావలన బ్రతికి బయల్పడితివని మాత్రము జ్ఞప్తినుంచుకొమ్ము. ఇదే వెడలెద. (అని వెనుకకు మరలును)

బకా—(స్వగతమున) మూఢురాలి నన్ను గొనిపోవుచున్నప్పుడు మజ్జనకుఁడు నన్ను విడిపించిన వానికి బరిణయం బొనరింతునని వాగ్దాన మొనర్చియున్నవాఁడు. ఆయాశచే బుడమి నెందరో వారై ప్రమందిరి. అంతచే నేల యీసుందరాంగుని తిందుపరచి పొమ్మననేటికి? నాజనకుఁడు విన్న కింక రెండవ మాటనడు. తిరుగ నీతని పిలిపించి పరిణయం బొనరింపక నంతకంటె మానఁడు. ఆయన ప్రతిన నేనేల హానిమొనర్ప నెంచవలె? స్త్రీస్వభావ ధర్మమును బెట్టుసరి చూపితిని గాని వీనికంటె సౌందర్య శాలి భుజబలాఢ్యుండు మహారాజు, నయవర్తనుఁ డింకొకఁడు కలఁడా? నాచాతుర్యము చూపి వీని మగలించెద. (ప్రకాశముగా) ఓమహాభాగా! స్త్రీజాతికి బెట్టుసరి కలదని మీయట్టి రసికాగ్రగణ్యు లెఱింగియుండియు పురుషజాతికిఁ గల తొందరపాటుకు లోనయింపుటకు మీయందేమి సరసమున్నది? మా స్త్రీజాతికిం గల బెట్టుసరికి దగు కారణము వినుండు.

ఉ. బెట్టిదనంబుఁ జూపి తగు ♦ బిత్తరిచేతలఁ జేత నొప్పచున్
గుట్టుకిటూలునం బడుట ♦ కుక్ బడనీక చరించు స్త్రీలపై
గట్టితలంపు ప్రేమ మతి ♦ గౌరవమిచ్చియు పూరపాలికిన్
బుట్టుట నైజ మక్కతన ♦ ముద్దియ లొద్దిక జూపరెప్పుడున్

అంతియ కాని మీపైఁ బ్రేమలేక కాదు. మహాత్మా! యిటు చూడుఁడు.

సదా—(స్వగతమున) ఈబెట్టుసరిపై నుండిన తప్పక నాయొప్పులాడియె మనే తేలుగాఁ జేసెంచి బతిమాలకలను. (ప్రకాశముగా) బోటి! నీబోఁటి బోటులవముఁ గల బోటుల మాటలు విని గారాటుపడుట నాకేటికి? ఒక్కఁటి రెండుమూఁడు సారులు నీసంగతి గనిపెట్టి యుండియును మగల మోసపోదు ననుకొంటివా. (అని నడచు చుండును)

బకా—(స్వగతమున) ఇంతవఱకు వన్ను వర్థించు టయినది. ఇఁక నేను వీనిని ప్రార్థించవలెనుగాఁబోలు (ప్రకాశముగా) దేవా! ఇదియేనా మీచాతుర్యము? ఒక్క దక్కఁవాంగిని తెలిసికొని లోఁగవలేని మీసరసత యేమిటి? మీమారశాస్త్ర పాండిత్య ప్రభావమేమిటి? (అడ్డుగా జని)

వెంకటరమణవృత్తము.

సరసవరుఁడ తెలిసేదు ♦ సరసము రసికతయు చాల్
సరసమెగా—విరసముగా—బరుగిడగా
తరుణి పరిహాసము కాద ♦ సరసమెఱుఁగక సరిగా
చలచలగా—అరిగెదుగా—నగవయెగా

సదా— తరుణి తెపము లెరిసినోసల్పి ♦ అరుగ నపహాసితముకా
ననునవగా—అనువయెగా—గదునుతెగా
తెలవలు చపలులనుమాట ♦ సరిగ సఫలతుకును నీ
వలననుగా—తలపడెగా—స్థిరపడెగా

(అని నడచుచుండును)

బకా—దేవా! బదులనకు బదులు తీర్చుకొను తలంపా యేమి? ఏవవో కటుకే బతిమాలెదు. (ఎదురుగా నిలచి)

సుందరివృత్తము. సరసిజనయనలుతోలుతని ♦ చన్వమాధ్రు పెండుసక
సరుసుఁడ వినికని యెుసుగుడ ♦ సత్యమాడు మీకృపకా
బురువలకును పోలఁతల కిది ♦ పొల్పవ్యత్యయం బహో
అరయుము మనమున నిజమును ♦ సద్గుమాపయిఁకా సఖా

సదా—(స్వగతమున) కొంత బెట్టుసరి తగ్గి లొంగుబాటునకు వచ్చినది. (ప్రకాశముగా) చెలీ! ఏల నన్ను బాధించెదవు?

చ. పొగయి సొంపునింపు సరి ♦ శుభ్రమమైన మిఠాయి తో లభిం
పగ నది లాభమేమి! మెస ♦ వండగు మంచి పసందు నోరు దా

ల్పగ భగవంతుఁడీతనికి • పూర్ణతుషాకర వక్త్ర! నన్నుఁ ద
ల్లగ నియ్యఁ డేమి పాపమిది • ప్రస్తుతి సేయఁగ మించ రెప్పుడున్

బకా—ఏమని ప్రస్తుతింతురు?

సదా—బహు మంచివాఁడని.

బకా—ఏవిషయములోను?

సదా—ఉపకారమున కపకార మెంచకుండఁగ విడిచిపెట్టినందులకు.

బకా—అయ్యయ్యో! ఉపకారమునకు ప్రత్యుపకార మొనర్చుటచే స్తుతికిఁ బాత్రురాలను గాని యుపకారమున కపకార మొనర్పనందున నెట్లు నుతికిఁ బాత్రురాల నగుదును?

సదా—లోకములో నపకార మొనర్చక దుష్టులై యుండువారలు కూడ నుపకారులే యని బుద్ధిమంతుల వచనము. కావున నాకపకార మెంచకుండ నాదారిని నన్నుఁ బోవనిచ్చుటచే మిగుల మంచిదానవని నుతించుచుంటిని.

బకా—ఆలాగునా? మీవలన నాకు నుతి యక్కఱలేదు. నీకు నే నపకారిణై బంధమునందుఁ జేర్చెద.

సదా—ఓహో! ఎప్పుడైతే నా రాజ్యలక్ష్మిని విసర్జించి పరరాజ్యలక్ష్మిఁ గాపించితినో యప్పుడే నాకు బంధప్రాప్తి కలదనియే యెంచితిని. అందులకు కూడా సంసిద్ధుఁడనై యుంటిని.

బకా—మీకొక రాజ్యలక్ష్మి కలదా?

సదా—పుట్టు బ్రహ్మచారి ననుకుంటివా యేమి? ఒకతె పెద్దల యాజ్ఞచేఁ బడసినది. రెండవ దనంతరము తానే యయాచితముగా మధ్యదారిలోఁ గలసినది.

బకా—రెండవది యెద్ది?

సదా—మధ్యపరగణా రాజ్యలక్ష్మి.

బకా—అనగా

సదా—నాగపుర ప్రభువగు రాణా జగదేకదేవుని పుత్రిక మోహిని యను కన్యక. తన రాజ్యమును నాకభిషేకించి నా రెండవ రాజ్యలక్ష్మియై చెలఁగినది.

బకా—(ఆశ్చర్యముతో) మోహినీ రాజ్యలక్ష్మి మిమ్ము పరిగ్రహించెనా? అయినచో భువనమోహినీ రాజ్యలక్ష్మికిఁ గూడ పరిగ్రహింప హక్కు కలదుఁ మహాభాగా!

ఉ. నీదగు రాజ్యలక్ష్మి ధర • నేఁ డిదె! యిట్టి సుబంధ బంధమం
దే దినమున్ నినుంచి మఱి • యేగతి నేఁ జెనొ యిట్టిబంధమం

దాదట నోర్చునట్లుంచె ♦ దక్షముగా మనురాజ్యలక్ష్మికిన్
మూదయులేక చోద్యుత బ్ర ♦ మత్తత నిత్తరి కారణంబుగాన్

(అని యస్తముగా నిలుచును)

సదా—(ఎగతాళిగా) ఆ చాలు చాలు. నిన్ను నమ్మితోని రాజ్యము భోజ్యము పూజ్యముచేసికొని యింతవర్ణ తెంచి ఏవిపదల్ని తొలంగించి. నేను నిన్ను వేడుకొన్న కొలంది తడిసిన మలకమంచము .గిరి ఓఱ్ఱ సిగోసిన పకబాక్షి పిస్సైన నన్ను ప్రేమింతువు ననమ్ము బెట్టాలు? నీచేతిమి కాశించుట కునకపుప్పము గాని యేమి దాంటటకై యాంగకు బడినట్లుండును. ఎందులకీ నిరోధము?

తే. గీ. పణతి! నాకు నీతో నను ♦ బంధ మెంచ
రసవిహీనమై శృంగార ♦ రసము లేని
నిలవెలయు ప్రబంధ రచనా ♦ కృతి యెటుంగు
గలయు నీచెల్మి నాకింక ♦ దలిసెహమ్మ

(స్వగతమున) ఈబెట్టుసరిపై నింక రెండడుగులు వైచిన కాళ్లబేరమునకు దప్పక వచ్చును. (పరిహాసముగా) చెలీ! నన్నెందులకు నిరోధించెదవు? ఇంతటితో నను పోవిడ్వకుండిన నింతవరకు గళకట్టిన యాశృంగార తరంగము యొక్క రంగ మొకవిధముగా మారి యుడకు రసాభాసా లంకారమగునేమో యని భయపడుచుంటిని.

బకా—దేవా! ఎప్పుడు ద్రోహింపనలదు. జరిగిన కొలంది నాటకరంగస్థల మతి శృంగారమై మనసునకు హాయి హాయి గొసంగి యీరంగస్థల మీగతిగా నుండిన బాగుండని యూహించుచూ పరుల మునంబటుత నాతో జేరిమి జరిగిన కొలంది మీయంతరాత్మకట్టి బుద్ధియే జనించును నాతప్పు సైరించి నన్ను క్షమింపుడు.

(బకావళి రుదురుగా మోకరించి)

వేంకటరమణావృత్తము.

పురుషవరుఁడ! పోఁకరి గోర ♦ పోవృటిటుల న్యాయమా
నావలకప్పున్—గావగనొప్పున్—గానరోలుమా
సదా— పురుషులకగుపడ నవాబు ♦ పృతిక వయసౌందిలీ
నల్యోరు నిన్నన్—నవ్వుహరెన్నన్—బుద్ధిదల్పవే
బకా— పరపురుషుఁడవె కమపింప ♦ వర్యోతయుగ నాకయో
ఆయు రెఘోషా—నీయదియోషా—కాగనొప్పదే
సదా— గరిసరి స్థతి నుదులకేను ♦ సంతస మెటు పొందుదున్
నీయవిపల్కుల్—నామొనమూల్కుల్—నీకతాళగా.

బకా—(లేచి నిలువబడి) దేవా! నాకీ బకావలి నామధేయ మెట్లు కలిగినది మీరాదియగు వినోదవల్లి వలన వినంగినగతిగా నేధరించిన యేవస్తువును తమ కొసంగుదునో దానివలన తాము నా భర్తరయినటులకూడ వినియే యుందురు. కావున!

మ. అకటా! నాపయి గోప మేటికి మ ♦ హాత్మా నాశిరంబందునన్
బక పుష్పార్పితమై రుచుల్ గులుపి యా ♦ ప్పారెండు శాఖల్ విధా
యక మెవ్వాఁడు ధరించునో యతఁడె నా ♦ యాత్మేశుఁడౌ గాన నా
రక నీ పుష్పలతన్ గ్రహించి ప్రియమా ♦ రన్ దాసిగా నేలవే.

(అని తనశిరమునగల బకపుష్పతురాయిని సదానందుని శిరమునునుంచి ముద్దిడును)

[తెఱలో దుందుభులు మ్రోయును]

సదా—(ముఖవికాసముతో) నాదాదివచనంబులటుల నీవాగురాయి నాకలంకరింపఁజేయుటచే నాచెలి వైతివి. ఇప్పటి నాకష్టము లన్నియును గట్టెక్కినవి ఎట్లంటివా?

ఉ. తల్లిని తండ్రినిన్ సఖుల ♦ దారను రాజ్యములాది నీకుగా
నెల్ల త్యజించి కానలకు ♦ నేఁగి, ప్రయాసల పొందినట్టి యా
తొల్లి శ్రమల్ నశించె నిక ♦ తూర్పుగెలుంగు నుపద్రవంబు నీ
వల్లన కాఁగలించి ప్రియ ♦ మారగ ముద్దిడి యుంటచే సఖీ!

బకా—మహాత్మా! నాకును నట్టులే.

ఉ. దక్కఁసి నన్ను దొంగిలిన ♦ రాయిడి నాకనుపింపలేదు నా
యిక్కను పాసినావనిన ♦ నేఁపరియుంతయు మున్నె లేదు పెం
పెక్కిన తల్లిదండ్రులను ♦ వీడితినన్న భయంబులేదు మీ
చక్కని చెల్మి చేకుఱుట ♦ స్వర్గసుఖం బటులుండెడి మిత్రమా.

సదా—చెలీ! యిందుక ర్తవ్య మేమి?

బకా—ప్రియుఁడా! అగ్రహ మొందకున్న మనవిచేసుకొందును.

సదా—సఖీ! నీచెల్మి కలుగగానే యాగ్రహమనునది పోయి యనుగ్రహమంటి వది. కావున త్వరితముగా వచింపుము.

బకా—మహాత్మా!

ఉ. తల్లిని చూపుతో మిగుల ♦ చక్కని ప్రేమతో నెల్లవేళలం
దెల్లసమొప్ప చూచుకొను ♦ చొయ్యన నన్నొక పేరువట్టులో
వల్లన వంశదీపిక మె ♦ లాగతి నెందుచు సంతసించెడా
తల్లిని దండ్రి వీడఁదివటే ♦ దైవములందు కలారె చెప్పుఁడా?

సదా—హా! నిశ్చయము. అయినచో?

బాలా—వారలను వర్ణించి వారికలన దీపన లొందినపిమ్మట మన రాజధాని యగు కాశీపట్టణమునకు వెడలుదము.

సదా—మంచిది. పెద్దల దర్శనమువలన పెక్కు లాభము లున్నవి. పద వెడలుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

తెరవాలును.

---

## ద్వితీయరంగము



ప్రదేశము బర్ద్వానపట్టె—దేవీ పాదుషా మహాలు.

[దేవీ పాదుషా యొకకుర్చీపైఁ గూర్చొనియుండ వారిని కనుఁగొనగా
సోఫాకుర్చీపై సదానందదేవుఁడు బాలావళితోఁ గూర్చొని
యుండగా వేశ్యలు నృత్యముతోఁ బాడుదురు]

వేశ్య—(వీణమీటుచు)

రమణీవృత్తము.

సుందరాకరా! అతి శోభనాకరా! కడుమీర ధీవరా! విశుద్ధభావరా!
ఇందిరావరా! భుజియించె దిందిరాప్రియము, నిందిరాకుమార మారబంధు, రా!
చందశేఖరా! యింక నాలమేలరా! చెలి యోగజాల దాబకావలీ, స్మరా
నందమీయరా! సుఖ మొందఁగోరెరా! యొదయుందుఁ జేర్పరా! ధరామరేశ్వరా!

నాదనామక్రియరాగము—ఆటతాళము

ధరణీవర నీ - తమకంబె మదిఁగోరి
విరతంబు నినుచెంచి - స్మరియించు సతిఁగాంచు। ధర॥
సరసాగ్రణి నినుబలో - పరసుంపెనవిగా
సతినీ - జతనీ - గతినీ - గతినూనె। ధర॥
దయతుండు ప్రియకూర - దత్తతో బాలావలి
చెలిపై - దలపై - తలపోత - నిలిపుంచు। ధర॥

మురబంతి యీ చెలి - విరిదోంతి ఈ పాళి
కసుమా - గోసుమా - ఇనవంశ - గుణరత్న! ధ॥
(అని యభినయముతోఁ బాడుదురు)

సదా — వేశ్యారత్నములారా! మీ గానకౌశల్య మత్యద్భుతముగా నున్నయది మీ యభినయ మభినందింపఁజేసినది. మామగారివద్ద సెలవు గైకొనుఁడు.

దేవి — వెలచేడియలారా! మీమీ నివాసములకు పోవలుఁడు.

వేశ్య — చిత్తము. (అని నిష్క్రమింతురు)

బల — తండ్రీ! యేలజాగొనరించెదవు?

ఉ. అలిక యౌవనంబలమ ♦ వాసుదిరోగును వత్తయింటి కం
బాలిక లోకధర్మముగ న ♦ వారిమ! యొఱెంగి విచారమొంద నే
నీతిని గూర్చిపావన సు ♦ నీతిచరిత్ర! విధాయకంబు గాఁ
గూఁతును గన్నవారి కొన ♦ గూడును గోట్లకొలంది పాట్లుగా

దేవి — అమ్మా! నీవచనంబుల రచన యదార్థము. కానీ నీతోఁబుట్టిన వొక్కరు మగవాఁడుండిన నాకంత విచారముండదు. ఇయ్యది వినుము.

చ. కొడుకులులేనియక్కఱతన ♦ గూర్మి వివాహమొనర్చి నీవు, నా
పుడమిభరంబు వల్లు నడి ♦ మూఁపువమోపి విరామమొంది నే
గడుపదలంచితి న్వ్యధిగ ♦ గాలము నిశ్చలదైవభక్తితో
నెడపక, గాన కూఁతువని ♦ యీవె కుమారుడవంచు నెంచితిన్

కాని వాతలంపోకటైనది. దైవవిధాన మొకటిగా నున్నయది. అందులకై కుందుచుంటిని గాని వేరొండు కాదు. ఏనుమాత్ర మెఱుంగనా! కాని

ఉ. పుట్టిన కూఁతురంచనఁగ ♦ పొల్పుగ బొట్టును బెట్టి వొక్కటికిన్
న్నట్టిన గోసి వేయుమను ♦ నీతిమనీషల సల్పవింటి నే
పట్టి! ఇఁకేటిమాటలు ప్ర ♦ పంచమునందున సాదుపిల్ల నే
గట్టావగాంచునో ? ధిగ ♦ గట్టిగ దానిని శిక్షచేయనా

సదా — మామయగారు! కూఁతుండ్రను గనిన వారిని శిక్షింపవలసిన దని మీ రొక శాసనము నేర్పాటు గావింపుఁడు.

బల — ఆర్యా! స్త్రీలకేనా పురుషులకుండదా యట్టి శిక్ష.

సదా — చెలీ! మీ నాన్నగారు తెలియఁగరాయేమి? సూల్బకావలియందు మంచి నక్షత్రమందు నిసుంగును కనలేదనిరేకదా జయపదుఁడను పుడమి కేఁడు తనపడతిని

కుపుత్రుని వధించుట కాజ్ఞ యొసంగను తనభార్యకుఁగల శక్తి తనకుండ దని యోచించెనా? యీనాఁడు మీతండ్రి యోచించుటకు.

బకా—జనకా! మహాత్ముల నిట మసలనిచ్చెదవు? మీకు మీ యల్లుని వలన నిని యేమి యుండును.

ఉ. నాగపురాధిపుఁడు తల • నాఁగను మోహిని కల్లుటందు, నీ
నాగబలంబు దర్శనము • నర్పకయుంచిన జ్యోత్స్నవగ్ని, యా
నాగసతీమణీస్మృతికి • నాయకుఁడీగతి బెట్టుట బ్రుందు, నీ
నాగసుధీరుఁడై చనడె • నాగతిమార్గము గ్రుగ్గనాకఁదా

కావున మా కింత త్వరలో సెలవిచ్చిన సంతోషము కలదు.

దేవి—అమ్మా! నేనవల్లె యోచించుచుంటిని.

ఉ. నందన! బంగళా ప్రభువు • నాథుఁడు నీకవనాడుదాని కా
నందమె, కాని రాజ్యరమ • నాఁడెడి వాఁడలు లేమి నాభుజా
బంధమునందు నిల్చె నటి • భాగములందున నుందునయ్యొనో
మందును? దీనికేమిగతి? యమ్మరో! తోఁచదికేమి చేతుగా

సదా—మామా! నావల నైనను నీకైన సేకరించవలసినదే. ఏముందును?

ఉ. అగలతండ్రియూఁపును మ • హాధరమై పడియున్న రాజ్యమున్
నావిధియేకఁదా తలఁగ • నంగను దానిని కొందుపల్లనో
భూవర! సీధరాభరము • భూనుటయెట్టులు? పోనిపూనినన్
గెలమంతకంటె యప • కీర్తి మరొక్కటి యుండునే మహిన్

దేవి—"తనకుమాలిన ధర్మము మొదలు చెడ్డబేర" మందురా? కష్టపడి కని పెంచి విద్యాబుద్ధులు చెప్పించి పెద్దవానిగా నొనర్చిన తండ్రికంటె మధ్యను పిల్లనొసంగిన మామయొక్క యాధిక్యమేమిటి? దైవమేమి చేసినను మేలుకొఱకే యను నమ్మకముఁగల దైవభక్తుల యోచనగతిగా నా యోచన యన్యథా యైనను నదియే నాకందులకే మంచిదని తలంచుచుంటిని.

బకా—తండ్రీ! నిశ్చయమే.

మత్త. నీవు నన్నొక బీదవానికి • నీతవస్తువు కిమ్మనన్
భావజుండన దగ్గవూరుదు • నర్థ్యమిచ్చి వివాహమున్
తీవిగా నొనరించి రాజ్యము • తేవగా నభిషేకమున్
భూవరా! తపణించి సౌఖ్యము • పొందనెంచితి కాకఁదా!

సదా— చెలీ! మీనాన్నగారి యోచనకు దైవసంఘటన కదియా వ్యత్యాసము. సరే! దానికిఁ దగినయోచన కూడా యోచింపుము.

బకా— జనకా! ఏదియొనర్చినను దైవము మేలుకొఱకే యనికదా నీదు దృఢ నమ్మిక. అట్టి మేలెట్టిదో యోచించెద వినుము.

మా॥ పుత్రికంచును లేదనే మది ♦ పొక్క, రాజ్యము పూనగా
పుత్రుఁడైనను కల్గలేదను ♦ పొందు దుఃఖము, బాపఁ దా
మిత్రుఁ డారిన దైవ సత్కృప ♦ నేను నీకిదు దాతఁడే
పుత్రుఁడై ధరమోము పుత్రిక ♦ పొల్పునకు ముదమిచ్చుగా

దేవీ— అంతవఱకు నీరాజ్యము నీభర్తయొక్క మీదనే వ్యవహరించెదను.

బకా— అయ్యా, ఇగ్గుని యానతియేకదా.

సదా— మీచిత్తము.

దేవీ— సరే! మీప్రయాణసన్నాహమునకుఁ దగిన సైన్యమును వాహనచయంబును నౌకర్లను మధ్యాహ్నమున నియమించెద. చల్లపాటువేళ మీరు వెడలవచ్చును. రండు భోజనాది క్రియలు కావింతము.

సదా— చిత్తము.

(తెఱ దిగపడును)

---

శ్రీరస్తు

# బంగన్ బకావలి



అను

## భువనమోహిని

## పంచమాంకము



### ప్రథమరంగము—ప్రదేశము నాగపురము

మోహినిసౌధము

[మోహిని విచారముతో సోఫాపైఁ గూర్చొనియుండ జుట్టు చెలులు నిలచియుందురు]

మోహి—(విచారముతో)

మ. ప్రియుఁడా! యిచ్చటనుంటివీవు చలిపైఁ ♦ బ్రేమంబు రాకుండెనే
అయయో! దుఃఖముబోటిగైరి బవలు రే ♦ యందున్ నినున్ బాయకన్
తుయాగోగంబయె నీవియోగమున ని ♦ స్సారంబు చేకూర నిం
కయినా, కూర్మి జనింపదా సఖుఁడ నా ♦ యందున్ వడింజేరఁగా

మహాత్మా! సదానందదేవా! నీనామమే నిరంతరము రామనామముగా జపించు చున్నదానను. నాకంఠస్వర మెట్లు క్షీణించినదో నీకుఁ దలియదా? హాసదానందా! ఆనందా! చిన్మయానందా!

బాపత—చతురశ్రగతి

ప్రాణేశ్వరా! దయుంచవేమి? నీశుభాంగిపై
నిన్ గన్నదాదిగా—మన్మథాగ్నిలో జ్వలించెగా
సాంగ్— ఆహా! నిర్లజ్జాంగినైయై ఏదేకభక్త
చిత్తనై నీపదాబ్జములు నమ్మి పోధ్యాన్నించెఁదా

సుందరిపై మనం బేల కగ్గదయుమో? ధరామరా!॥ ప్రాణే॥
హే సుగుణాఢ్య! సత్యవచన ప్రియా!
పాంగ్ — సఖసదానందమూర్తి! బంగరుచక్రవర్తి!
ఇఁక జాగు సలుప ప్రాణములు నిలువవు చనుము దేవ॥ ప్రాణే॥
(అని కుర్చీపై జారగిలఁబడును)

1 చెలి — చెలీ! యిదేమి ప్రార్థనము. అతఁడు పెట్టిన గడువు నేఁడుగదా? అంతగా దొందరపడ నేటికి?

2 చెలి — సఖీ! ఇంకా జాముప్రొద్దైన నెక్కలేదు. అప్పుడే గడువతిక్రమించినట్లు దుఃఖించుచుంటివి. లేలెమ్మా. ఎందులకీ యాత్రము.

చ. ననవవలాడు తేఁజిగురు ♦ వందిన పర్ణము లారగింప జా
ప్రవిమలమైన కొమ్మఁగల ♦ పజ్జను కోవెల తేగుభాతిగా
ననవవలాడు తేఁటయును ♦ నందధరామృత మారగింపనా
ప్రవిమలమైన కొమ్మఁగల ♦ పజ్జను గావరు తేగుడించరే

3 చెలి — అమ్మా! యెట్టిపగవారికైనను వలపను పని కూడదు. అది స్త్రీపూరుషులకు ప్రాణాంతమును దెచ్చును. ఎట్లంటివా!

కం. వలపనియెడి వస్తువు తాఁ ♦ దొలుత నొక్కరుని జంపి ♦ తొరగా వార్తన్
తెలిపటు రెండవవారిని ♦ బొలియింపఁగ జేయుగాద ♦ పూర్ణేందుముఖీ!

కావున విచారముడిగి యోపిక బట్టుము.

మోహి — చెలీ! ఎంతకని యోపికపట్టను? ఆమహనీయునికై తపించుటచే నారూప మెటులున్నదో చూచితివా?

ఆ. వె. తెల్లవారుజాము ♦ దీపంబు వగిదిగా
వెలవెల నగురూప ♦ మొలసియుంట
వెలుఁగు రాఁగదీప ♦ కళతగ్గునటులుగా
సంతసంబు దగ్గి ♦ సమసెదింక

1 చెలి — అయ్యయ్యో! యిదేమి గ్రహచారము! రేయిగడచినపిమ్మట పవ లేతెంచదా? ఆకులు రాల్చిన కొమ్మ చిగర్చదా? దుఃఖమంతరించి మరల సంతోషము రాదనుకుంటిరా?

మోహి — రానివో

2 చెలి — తమ్మికవధిగా వచ్చితీరును. కాని యంతవఱకోపిక పట్టవలెను.

(అంతట తెఱలోపల కలకలము)

[ఒక స్త్రీ పరుగెత్తుకొని వచ్చి]

స్త్రీ—అమ్మా! నాగపురరాజనందనా! సదానందమూర్తి మిగుల నానందముతో నొక సుందరాంగితోఁ గలసి యాందోళికముపై యేతెంచుచున్నవాఁడు. అల్లదే తూర్పుదెసగా విలోకింపుము.

మోహి—ఆ. చాలు. నన్నిప్పుడా యెగతాళిచేయు కాలము. (చూచుటభినయించి) ఈశుభవార్తయే నిజమైన భూదేవి నాకై యూసవిడువవలసినదే.

3 చెలి—అమ్మా! ఇంక ననుమానమేమిటికి? నిక్కముగా నాతఁడే నీమక్కువ ప్రియుఁడు. ఆచక్కనున్నదియే బకావలి.

మోహి—(సంతోషము నభినయించుచు పైట జక్కపఱచుకొని) నెచ్చెలులారా! చూచితిరా! మున్నా వన్నెకాఁడు ప్రయాణబడలికచే కృశించియున్నవాఁడు. ఇప్పుడు మనమాతని యానవాలు పట్టలేనంత దృఢగాత్రుఁడై యున్నవాఁడు.

1 చెలి—చెలీ! ప్రియానురాగమున కృశించి నిర్జీవప్రతిమవలె గదియుక్రింద కాన్పించిన నీవే యిప్పు డెటులుంటివో యెఱుంగుదువా?

ఉ. అప్పటచేతనే ప్రియుని ♦ జాద్యభర బర్వన మంతమాత్రనే
యుబ్బె కుచద్వయంబు, మది ♦ యుబ్బె, ననేకములైన కోరికల్
యుబ్బె, శరీరమంతయును ♦ నుబ్బె ముదంబున, నింక స్పర్శనం
బబ్బిన నేమి కావలయు ♦ సంగన నీదగు రంగు తెల్పుమా!

2 చెలి—నీవాడినంత మాత్రమున ననుభవములేని మన నెచ్చెలి యేమి యచించ గలదు.

మోహి—నెచ్చెలులారా! యేమి యెగతాళి చేయుచుంటిరి?

3 చెలి—సఖీ! నాగపురరాజనందనా! ఆయాందోళికము నాన్నగారి యుద్యానవన ముఖద్వారము చొచ్చినది.

1 చెలి—అవును నిశ్చయమే. చెలీ! మోహినీ. ఇఁక నీవు పూర్ణాలంకృతురాలవగుటకు మనకు వ్యవధికలిగినది. అటుల కానిమ్ము.

మోహి—సరే! రండు. అంతిపురమునకు వెడలుదము. ఇంతలో మానాన్నగారి వద్దనుండి పిలుపు రాఁగలదు.

చెలికత్తెలు—మంచిది.

(నిష్క్రమింతురు)

(తెర వాలును)



# ద్వితీయరంగము

జగదేకదేవుని యుద్యానమందిరము.

[జగదేకదేవుఁ డున్నతాసనముపైఁ గూర్చుండెఁగా నెదురుగా సదానందుఁడు, బకావలి, మోహిని యున్నతాసనములపైఁ గూర్చుందురు. ప్రక్కను చెలికత్తియలు పుష్పహారములతో నిలచెదరు]

జగ—ఓసుకుమార! సదానంద! "కన్యావరయతే రూపమ్" అను వాక్యము సార్థకమైనది.

ఉ. అందము నిస్స్వరూప మతి ◆ యందము లా మృదువాక్యసంచయా
నందము వర్తనంబు గన ◆ నందము లౌ కడఁ గంటిమూపుల
త్యందము నెన్నఁడున్ వినన ◆ మందము నీయెడ లంటఁ జే సదా
నందము జైత్రవంతము మమ ◆ నందన బొందవలంచె పొందుగాన్

సదా—(నవ్వుచు) మీపలుకులు యథార్థములే. ఏమంటిరా?

కం. అందము ప్రతివారికి నా, నందంబై క్రియకు నెంచ ◆ నరుదగు బ్రహ్మా
నందమును గూర్చి మోహా, నందములోనికిని ద్రోయు ◆ నద్దినుమాత్మా

బకా—ప్రియా! మీ వచనంబులయందు కూడా రచన కలదు. అందులకే తాము జగన్మోహినిని బరిణయంబై భువనమోహినిని జేకొని మోహినికై పరితపించుట యానందముయొక్క మహిమయే కదా?

జగ—అమ్మా! నీనుడులు నిశ్చయములే. (అని లేచి) ఓసదానంద! సస్సదానంద! ఆనందా! (మోహినిని జూపి) ఎట్లు చూచుకొ నెదవో?

ఉ. ఓసుకుమార మా! సుగు ◆ ణోజ్జ్వలసుందర! నాకుమాత్రయా
యీసుకుమారగాత్రిని య ◆ హీన శుభాంగిని బాలమోహినిన్
దాసిగ నంది నీకుఁ గల ◆ దాసియలందున నొక్క దాసిగా
నాసిగ నేలవయ్య బుధ ◆ వర్య వరాంగన నీకు నంగగున్

(అని మోహినిచేఁ బుష్పహారమును సదానందుని కంఠమున
సదానందునిచే మోహినికి వేయించును)

సదా—(చిఱునవ్వుతో) ఏమీ? యీహారయంత్ర ప్రభావము!

ఉ. హారము రెండు శబ్దముల ◆ కర్థము హా "హరియించు" నంచ నే
సౌరుగ కల్గుదానికది ◆ సార్థకమై కనుపట్టెనూమ! యీ

హారము నెవ్వఁడిచ్చె గళ ♦ మందున వైచెనొ యెవ్వఁడే వనో
హారిశ్రేష్ఠుఁ హరించె మది ♦ యుంపు దలంచెద నిశ్చయంబుగాన్

కావున మీకుఁ నేఁగతిగా గాంచెదనో యను చింత వలదు.

మోహి—తండ్రీ! నాకిదివఱకుండిన స్వేచ్ఛ వదలిపోయి యీ హారమువలన నిర్బంధ మొకటి కలిగినది. ఎట్లంటిరా?

ఉ. హారము వైవఁగా ధవుఁడు ♦ బానకు సంస్కృతి భార్యమై ప్రతీ
హారగ నిల్లుగాచి వ్యవ ♦ హారము సల్పుచు భర్త కింపుగా
హార మొసంగుచు మరి వి ♦ హారము జాతిమి నాపుమన్ సమా
హారముగా ప్రతీ విషయ ♦ మందు మెలంగిన బద్ధ దక్షగా.

బకా—(పక్కున నగి) చెల్లెలా! ఒక్కహారమున కిన్ని యుదాహారములను దెప్పితివి?

సదా—బాగీ! అందుల నుపహార మొసంగవలసియుండునా యేమి?

మోహి—మీ తెల్ప వ్యాహారములే మా కుపహారములు.

బకా—అవియే మాకు మంచి ఫలహారములు.

జగ—ఆర్యపుత్రా! పుత్రికాభారమును దీర్చినట్లు రాజ్యభారమును గూడా తొలగింతును.

సదా—దేవా! మీ రాజ్యభారమును తొలగింపనెంచిన మా తండ్రిగారి భారమును భరింతువా రెవరు?

బకా—బాబయ్యగారు! ఈవిషయములో నిదివఱకే యొక రాచబాట మా తండ్రిగారివద్ద పడియున్నది. ఎట్లంటిరా? వినుడు:—

ఉ. పుత్రులు కల్గరే దనెండి ♦ పొందెను దుఃఖము, చింత లేదనే
పుత్రిక వైన జెంగ లివి ♦ పోవదు పక్షమ్ జనియింపఁ గాని దౌ
హిత్రుని బంప మీదటికి ♦ నెంచఁగ నాతఁడె ధాత్రి మోచుచో
బుత్రుఁడెయై ముదంబిడఁగ ♦ బుత్రికయై కనుపట్టు నెట్టనన్

దేవి—అమ్మా! యింత యదృష్టమా?

బకా—తండ్రీ! మీరు సర్వజ్ఞులు. రాజ ఋషిచంద్రులు. త్రికాలవేత్తలు మీకు తెలియని సంగతి కలదా?

ఉ. ఇమ్మెయి నిశ్వగాత్మజను ♦ నే మనుజుండు మనః ప్రమోదియై
నమ్మి యొసఁగునో యతని ♦ సర్వ్మలి నిక్కముగా ఫలించునంచ నే

యమ్మ సుకృతుల్ పఠింపఁడమ ♦ నంటె బుధాళి యసత్యమాడెనే? స
త్యమ్ముగ దేవునిం గొలచి ♦ యాతనవారు తలారఁ జెప్పరే.

దేవి—అమ్మా! దైవమును నమ్మక చెడినవారలుం గలరు కాని నమ్మి చెడినవారలు లేరు. కాని దైవము శోధించుటకై మన మనస్సు ననేక యుక్తులను గూర్చుచుండును. వాటికి జంకక భక్తిని విడువక తదేక దీక్షతో సల్పువారికి మనోరథ మీడేరుట నిశ్చయము. ఇయ్యది నా నమ్మకము. కావున నాకు భగవానుఁడు దౌహిత్రు నొకవత్సరములోఁ బ్రసాదింపగాత. అమ్మా! మోహినీ!

ఉ. ఈవు బకావళి సఖిని ♦ నెన్న సహోదరి యట్లు లెంచి, ఆ
మేవిధమైన నాన నిడ ♦ నీకు వహింపక నాదలంచెదన్
బూవులకు త్తిఁ దాల్చినటు ♦ పొందుగ దాల్చి మెలంగవమ్మ! ఓ
నా వరహాలమూట సుగు ♦ ణాలకరాట! పసిండి కోటరో!

బకా—తల్లీ! మీయాత్మజ నావలెనే యొక మహారాజు ననుఁగుపట్టి. నా వలెనే బంగళాచక్రవర్తికి గోడలు. నాయందలి మీరుండుకొనిన గౌరవముచే నట్లొప్పుగించుచుంటిరి గాని వేరొండు కాదు.

ఉ. ఊహఁదలంప నొక్క వగ ♦ పుంగవు నగ్గలి పట్టిగాన ఆ
మోహినియందలో, యంతె బ్రియ ♦ పుత్రి నవాబుకు నైన యీ భువ
న్మోహిని, వంగివంగి కయి ♦ మోడ్పు లొనర్చుచునుంట నా జగ
న్మోహినిపట్ల యిద్యోగము ♦ యొక్కటెనాయధికం బదేమొకో.

సదా—చెలీ! బకావళీ! నీకంటె ముందుగా బెంగాలీదేవ వెలువ యగుటచే పెద్దరికందాయని మీరలు గౌరవించిన గౌరవించవచ్చును గాని నాకుమాత్రము నీయందు లనే గౌరవ మెక్కువ. ఏమంటివా!

ఉ. స్వార్జితమైన వస్తుచయ ♦ మందలి యుండెడు గౌరవంబు పి
త్రార్జితమైన వస్తుచయ ♦ మందున నుండ దదెంతదైన పి
త్రార్జితమైన దానికద ♦ దానియెడన్ గరువంబుకంటె నా
స్వార్జితమీవు నీయెడ స్వ ♦ భావము గౌరవ మంకురించుటల్

మోహి—మహాత్మా! మిమ్ములను మహాపెన్నిధిగా నెంచి వరించిన నీతియని యథోగతియేనా?

సదా—చెలీ! ఎంతమాట!

చ. గురుతరమైన కల్పన, న ♦ యంతితమైన ప్రియంబు మైత్రిచే
గరువ మెలర్ప నన్ను గను ♦ కాంతయుడన్ గరువంబు మాపకన్
గరువముగా మెలంగివ, న ♦ గౌరవ మొందుటె, యేనిలుంగ నే
గరువమెసంగి గౌరవము ♦ గైకొనుమంచును నాడుటల్ బుధుల్

పరస తెలింగిన భార్య నెంతగౌరవించిన నంత యనుకూలముగా సంచరించును. అందువలన పురుషున కెంతయైనను సౌఖ్యము కలదు. దానితో సంసారము స్వర్గమందలి విహార మటులుండును.

బకా—ప్రియా! మీకెదుటున్నదే పెండ్లికూఁతురని మా యభిప్రాయము.

మోహి—అక్కా! నిక్కమే. ఎదుటవారిని స్తుతించుటయు నెక్కడనో యున్నవారిని నిందించుటనుబట్టి యీ మహనీయుఁ డట్టివాడే. యని గన్పట్టుచున్నయది.

సదా—(నవ్వి) ఆహా! ఎంతవఱ కూహించితిరి. మీయక్కను నేను నిందించు చుంటినని యీ మీ యభిప్రాయము. దాని గౌరవమునకు ఘన మందలము లోక్కు. ఎట్లంటిరా?

ఉ. ఆడితి గేలికట్లు పితృ ♦ రార్జితమైన ధనంబుచేత, చే
కూడెను స్వార్జితంబు గన ♦ కొప్పుగ నా పితురార్జితంబుకున్
గూడిన గౌరవంబు సమ ♦ కూడునె యేయెడ స్వార్జితంబుకో
చేడెలు! మీ తలంగని వి ♦ శేషము లేనువచింప నేర్తు నే

దేవీ—బాలికలారా! మీ యూటమఁదగిన యోటు మద్దెలకాడే యీతఁడు. అనఁగా మీమాటల కోటుపడువాఁడు కాఁడు. ఇక్కడ పితురార్జితమనగా దండ్రిగారు పెండ్లిచేసిన భార్య. స్వార్జితమనగా దాను సంపాదించిన భార్యలు. అనగా మీయిద్దరు. భార్య గుణవంతురాలు కావున నీ యామె యంగీకారభావమున మిమ్ములను చేపట్టుటకు వీలయిన దని భావము. అందువల్ల నామె గౌరవము మీకెల్లు వచ్చునని శ్లేష.

బకా—తండ్రీ! ఆగౌరవ మామెయం దుండవలసినదనే మా యభిప్రాయము.

మోహి—జనకా! ఆమె గురువారివారమే మేము.

దేవీ—అమ్మా! అట్టి మమేకము మీకు నాకసౌఖ్యమువంటిదే. ఎట్లంటిరా?

ఉ. మీరలు ముప్పురుం గలసి ♦ మిక్కిలి స్నేహము గుండిరేని మీ
గారపుభర్తకా ప్రియము ♦ కాంచెడువారలకా ముదంబు మీ
కూరిమి యత్తమామలకు ♦ గొప్ప ప్రమోదము గాన నట్టి సం
సారము స్వర్గతుల్యము వి ♦ చారము లేమిగ లోటు లేమిచేన్

సదా—మామా! మీమాటలు నిశ్చయమౌలే. ఏమియును లోటులేని సంసారములో నైకమత్య ముండిన నంత సుఖము స్వర్గమైనను కాదని నాయభిప్రాయము. పోరాటములచేఁ బ్రొద్దు పుచ్చుచు లేమిచే బాధపడు సంసారపుబాధ ఘోరనరక బాధయే యని నా తాత్పర్యము. అయ్యా! మాకు సెలవొసంగ వేడెదను.

దేవీ—ఇచ్చట మూఁడు రాత్రులు గడపినపిమ్మట వెడలవచ్చును. రండు వెడలుదము. భోజనమునకు ప్రొద్దెక్కినది.

అందఱు—మంచిది.

తెఱవాలును

---

## తృతీయరంగము

[ప్రదేశము అరణ్యము. పూర్వము సదానందుఁడు మునింగిన చెర్వు]

[ప్రవేశము సదానందుఁడు బకావలి మోహిని చెర్వుగట్టుపయి]

మధురగతి రగడ

సదా—
మాయామోహిని ♦ మాయవనంబిది, మాయురె! కాంచఁగ ♦ నాయే భయంబది

బకా—
ఏమది ప్రియుఁడా! ♦ యేమటుపల్కెఁగ, నీమది సంశయ ♦ మేమది దెల్పఁగ

మోహి—
హేమహనీయా! ♦ ఈకాసారము, ప్రేముడితోఁగను ♦ బెడఁకువిచారము

సదా—
మును చెలులారా! ♦ మునిఁగీ వనమున, పొనరుగఁ దేలితి ♦ మోహిని వనమున

బకా—
ఓహో! యదియా ♦ యొనరించిన బల్, సాహసమున కిటు ♦ జంకితి వేచాల్

మోహి—
చెలఁగు బకావలి ♦ చెలియాకారము, కొలఁకునకవఁబడ ♦ గొనుటకు నీరము

బకా—
లందుమునింగిన ♦ సుందరకుమారుఁడే, యంచెటులందును ♦ సందియ మొందఁడే

సదా—
అందముల కరయోగా ♦ సుందరులారా, లొందని కష్టము ♦ లొందితినారా?

మోహి—
రక్షాబంధము ♦ ప్రశ్నబలపమును, రక్షగ మంత్ర దండ ♦ లంకగ నేలను

సదా—
ఆ హేతువుచే ♦ వంత తెగువగను, మోహిని యౌంటెని ♦ మునుపటిగం జెను

బకా—
సరిసరి యింక ప్ర ♦ శంసను విడనగు, అరుదగు చిత్రము ♦ లవిరోవి గననగు

[ప్రవేశము రెండవయుద్ధున మాయామోహిని మహిళ]

మహి—చెలీ! నీపాతిపగలుడు మరలిన్ని దినంబులకు వొలికినవాఁడు వానిని లోఁగొనుటకు యత్నింపవా?

మాయా—సరిసరి. ఇంతనే పాలోచింతువా? నాకు కొలికదాని కొయ్యనై నాకు. యేమంటివా?

కం. సాక్షాద్దైవము తెలుఁగున, రక్షాబంధంబు సాక ♦ ప్రశ్నబలపమా
రక్షకు నిల్వఁగనో యు, బ్జాక్షీ! వాని నెటులొంచ ♦ నగుగాఁ జెప్రమా

మహి—ఆ రెంటిని సంగ్రహించు శక్తి యుక్తిగాఁ బన్నము.

మాయా—సఖీ! వీని వల్లను గదా నను గన్న జనకుని గోలిపోయితిని. మోహ మంతటి పాడువస్తువ యీప్రపంచమున వేఱొకటి లేదు. ఏమంటివా?

సీ. కనిన జననినైన ♦ కట్టుకొనినబాయు, కేని జంపింప య ♦ త్నింపఁ జేయు
తన ద్రవ్య మనగాని ♦ తక్కువా నల ద్రవ్య, మపహరింపఁగ జేయు ♦ మమతఁగొల్పు
అదిపాప మిదిపుణ్య ♦ మను విమర్శనలేక, మొదలంత బొంకుట ♦ కెదఁదలంచు
అదిమంచి దిది చెడ్డ ♦ దని యోచనయులేక, నట్టికీడున కొడి ♦ గట్టనెంచు
తే. గీ. అదిమహామోహమది మహా ♦ నాకమటుల
రేఁబవలు విడువక సంచ ♦ రింపఁజేయు
మోహమనెడి పిశాచంబు ♦ మూర్ధ్న మెక్కు
యట్టి తుచ్ఛవస్తువు లేదు ♦ గట్టిగెంచ

చూడుము! మజ్జనకుని బరిమార్చినన్న కినుక లేదు గాని వీనినివంచించి నావలలో జిక్కుకొనలేకపోతినే యని కినుక గట్టిగా బాధించుచున్నయది. ఇప్పుడు నాకొక చక్కని యుపాయము పొడగట్టినది. నా మంత్రశక్తిని వినియోగించి వీరికి నిద్రావస్థను కలిగించితినా? వీనిని తృణప్రాయముగా జయించితిననియే యెంచుము?

(అనికొంచెముబూడ్దెను చేలనుండి తీసి) ఇదిగో బూడిద దీనిని నేమంత్రించి పైకి విసరెదను జూడుము (అని ఓ కాళి భద్రకాళి యను దండకమును చదివి పైకి బూడ్దె నెగుర వేయును)

బకా—దేవా! ఎంతలో నభోంతరాళము మారినది?

వేంకటరమణవృత్తము

కాఱునల్లనైన మేఘ ♦ వార మావృతంబు బల్
తీరుగా హోయల్—గప్పుచుండెగా బయల్
మోహి— మీఱిమించు తీగలార ♦ మించి యాకసంబునన్
భూరిజగ్గనన్—కల్లు చీకిలించెడున్
బకా— భోరుమంచు హోరుగొల్పి ♦ వారిదావళి ధ్వనుల్
చేరి వినులన్—సల్పెదిమ్ము వట్టిగన్
మోహి— మారుతంబు వీచెడిందు ♦ మాహా! హోయిహోయిగై
కూరుకొందె మై సొమ్మరికంబు దప్పగాన్

బకా—వెచ్చెంబులారా! నిశ్చయముగా నీయున్నా నిలచి వర్షించినచో నేమగు తోంపములావరి ధారపడి యొక్క ఘడియలో నీయవనీతలమును మహార్ణవము క్రింద మార్చివేయకుండునా?

మోహి—అందులకే భగవానుడు ప్రసంపావాయువు నుత్పత్తిచేసి మేఘమాలను పాఱదోలుచున్నాడు.

మాయా—మహీశా! ఇక భయము లేదు. సదానందుడీ మాయమేఘమాల మనవలన నిర్మింపబడినదని గుర్తించలేకపోవుటచే వీనినిపంచించుటతి సులభము.

మహి—ఎట్లొనర్చగలవు?

మాయా—నీవు చూచుచుండుము. వీరికి నిద్రాదేవతను నావహింపజేసి గాఢనిద్రలో నుండగానే యొకవంక బన్ని రక్షాబంధమును, ప్రశ్నబలపమును దీనికొని యాపైన వీనిని కూదాక్రాంతునిగా జేయుదున్న వన్నీపేరను భిల్వకుము. ఇదిగో బూడిద నిద్రాపిశాచము వారల నావహించుటకై మంత్రించి యెగురవేయుచుంటిని. (అటుల చేయును)

బకా—ప్రియా! ఈగాలి సోకినంబోలు శరీర మంతయును జిలుకపొడిచినట్లుగా యుండి యొక విధమైన మైకము కూడా వచ్చుచున్నయది.

మోహి—మహాత్మా! నాకును నట్లే యున్నది. కనురెప్పల నినుపగుండ్లు వ్రేలగట్టినంత బరువులుగా రెప్పలు పడిపోవుచున్నవి. ఒక విధమైన నీరసము కూడా యొదవి నిద్రాశక్తికి మనసును లురిగొల్పుచున్నయది.

సదా—చెలులారా! నిశ్చయమే. ప్రయాణ బడలిక వలననో లేక నీచల్లగాలి మహాత్మ్యము వల్లనో నాకును నట్లే యున్నది. రండా తిన్నెపై మన సేవకులు మనకై పఱచియుంచిన శయ్యలపై విశ్రమింతము.

బకా, మోహి—చిత్తము.

(సదానందుఁడు బకావళి మోహిని నిష్క్రమింతురు)

మాయా—మహిళ, మనయుక్తి సాగినది. ఇఁక తాయెత్తు నొక్క తృటిలో సంపాదించెదను. నావెంట రమ్మా.

మహి—మంచిది. (ఇద్దరు నిష్క్రమింతురు)

తెఱవాలును

---

## చతుర్థరంగము



విశాలమగు బయలు—అందు డేరాలు

[వేరువేరు మంచములపై బకావళి, మోహిని, సదానందుఁడు నిదురించుచుండ గా మహిళయు దాసివేషముతో మాయామోహిని ప్రవేశింతురు]

మహి—సఖీ! మాయామోహిని! నీ వేష మచ్చముగా నొక దాసిదాని గతిగా గన్పట్టుచున్నది సుమా?

మాయా—చెలీ! మాటాడవలదు. నేనే యీ విచిత్రచేష్టలను గనిపెట్టుచుందును. నీవిచ్చటనే నిలిచియుండుము

మహి—మంచిది. బహుభద్రము. సదానందుని దెబ్బ యిదివఱ కెఱుంగుదువు కదా? జాగ్రతగా వంచింపవలె.

మాయా—(సదానందుని సమీపించి) ఆర్యపుత్రా! బకావళి, బకావళి. పాపము, పాపము.

సదా(పరుండియే) ఏమది. దాసీ! ఏమది.

మాయా—ఆమె భరింపరాని తలనొప్పిచేఁ బాధపడుచున్నది.

సదా—(పరుండియే) అందులకు నన్నేమనెదవు?

మాయా—ఏమియును లేదు. మీవద్దనున్న వస్తువులేమైన, ప్రశస్త బల్పము నొసంగినచో దానిని కడిగి యానీరు త్రావించిన సులభముగా నుండునట. కావున నాకేంటి నొసంగుఁడు. ఒక్క ఘడియలోఁ దిరుగ గొనివచ్చెద.

సదా—(పరుండియే) ఆ యిదిగో! యీ వెండి భరిణయందున్నవి జాగ్రత. పని ముగియఁగానే కొనిరమ్ము. (అని యిచ్చును)

మయూ—మహాప్రసాదము. (అని తీసుకొని మహిళ చెంత కేతెంచి) చెలీ! మనము వచ్చినపని నైనది. ఇఁక నాతమాషా చూతుము. రమ్ము చాటున దాగి మంత్రప్రయోగము గావించెదం.

మహి—మంచిది. (అని యిరువురు నిష్క్రమింతురు)

(అంగట నెట్టులో)

ఉ. మందమతీ! దురాత్మ! యెవ ♦ మాన మొనర్చిన దుష్టరో! సదా
నంద! యికెందు బోయెదవు ♦ నాచెయిఁ జిక్కితి వీవు నీచెలుల్
బొందను ప్రాణ ముండఁగను ♦ బోవఁగఁ జాలరు మిమ్ము నెల్ల నే
నిందు సమాధిచేసి సమ ♦ యించెద పాతకుఁగా సమూలముగ్

అటులఁ గావించితి నా జనకుని నీవు బరిమార్చిన ఋణమును దీర్చుకొనిన కూఁతు వగుదును. పైగా నన్నిదినములలో బరాభవించిన పరాభవమును దీర్చుకొనినదాన నగుదును. ఇదిగో నీకు ముందుగాఁ గూర్పఁ బోవు దాపదను గూర్చి వినుము.

మత్త. ప్రీతి నమ్మికఁ జూపి నాదగు ♦ పేర్మి తాయము నాఁచుకొన్
ఘాత నొనర్చిన ఘాతకుఁ బ్రతి ♦ ఘాతగా మిము మార్చి పెన్
రాతిబొమ్మల క్రింద నాపయి ♦ రట్టు పెట్టి కలంచి నే
గోతఁ ద్రోతును నాదు చెల్మికిఁ ♦ గూర్మి నీకొనరుండెనన్

(హేకాళి భద్రకాళి యను దండకమును బాడును)

బకా—(పరుండియే) హా! ప్రాణప్రియా! యిదేమిపాము? యిదేమిగ్రహచారము? నా శరీర మంతయు బఱువెక్కి రాయివలె ఘనీభవించుక పోయినది. అయ్యయ్యో (విచారముతో బిగ్గఱగా)

గత్తు. ప్రియుఁడ ప్రియుఁడ నన్నికన్, దయను త్వరగ నేలగాన్
వలపు దలఁపనేనికన్, త్యాయము కలుగు దప్పకన్

మోహి—మహాత్మా! యిదేమి? ప్రారబ్ధము. శరీరమా కంఠమువఱకు శిలాకారముగా మాఱినది. ప్రాణము కంఠమందున నున్నది. అయ్యయ్యో! అన్నన్నా! (యని బాధ నభినయించుచు విచారముతో)

మనోజ్ఞ. దడదడమంచును గుండె ♦ తద్దయు కొట్టుకన్
గడగడ మంచొడలెల్ల ♦ కంపము నొందఁగాన్

తడఁబడె ప్రాణము లాహా ♦ తథ్యము పోవటల్

ఒడయుఁడ! యేగతి గాచె ♦ దూహ యొనర్పనౌ

సదా—సఖియలారా! నాశరీరము కూడా శిలగా మారినది. ఏమిచేయుదు.

మత్త. మాయమోహిని కల్పితం బిది ♦ మాయచే మనలందరిన్

హాయిగా వశ పర్చుకొనెను ♦ నన్ను యీవాను ముందుగా

రాయిక్రిందను మార్చి కొల్పిన ♦ రిట్టు, లోనవునంము నో

ప్రేయసీ విడకున్న ధైర్యము ♦ వీడుగా మన యాపదల్

బకా—దేవా! నతినులేమాని ప్రశ్న బల్పను లేమయినవి?

సదా—చెలీ! అరఘుడియక్రిందటనే నీకు శరీరములో స్వస్థత లేదని నీదాసి వాటితో నీటను గడిగి ద్రావించుటకు లేలేదా?

మోహి—మహాత్మా! అవియుండిన మన కీ దూపదలు దరికే రాకుండును. వానిని మోహినియే మీరలు నిద్రావస్థనం దుండ మోసము జేసి హరించియుండును.

సదా—నిశ్చయమే.

(అంత లోటలో)

మాగా—ఓహో! క్రియకు ప్రతిక్రియ చేయఁజాలని నీయట్టి యవివేకులు ధైర్యమూనక నేమిచేయుదురు? ఇదిగో! యీ ప్రయోగము చెల్లను గాముకొమ్ము.

మత్త. చిమ్మచీఁకటి కొల్పి మబ్బుగ ♦ జేసి యాపయి సర్ప రా

జమ్ములన్ జలధార మారుగ ♦ జల్లుజల్లన విస్ఫులిం

గమ్ము లెన్నఁగ శీకరంబులు ♦ గాను వర్షముక్రింద నో

కొక్కమ్మదిన్ గురిపించి మిమ్ములఁ ♦ గూల్చి కాల్పఁగఁ జేసెదన్

(అని మరల హోంకాళి భద్రకాళి యను దండకమును జదువును)

బకా—(వణంకియే) మహాత్మా! చచ్చితి, చచ్చితి. ఇంక దిక్కెవ్వరు? యీ ఘోర విపదాబ్ధిని దాఁటించువా రెవ్వరు? అయ్యయ్యో (విచారముతో)

మత్త. కుప్పతెప్పల క్రిందఁ బాములు ♦ కోట్లు మేట్లుగ నాయెడల్

కప్పె నిప్పు కణంబు లాపఁగఁ ♦ గప్పె యూపిరి యాడకన్

గొప్పబాధ లభించె దేవర ♦ కోలుపోయిన ప్రాణముల్

జప్పునన్ మరలింపఁగల్గిన ♦ సాధ్యమొక్కటి యుంచుమా?

మోహి—సఖా! యిదేమి పాపము! ఓ దేవతలా విడిచిపెట్టితిరే!

మార్తిక మాల. నతునుత్రైమాని ♦ వరవరా! ఆ, రక్షకమా ప్రశ్న ♦ రమణ బల్పం

ఠీకుణమే యున్న ♦ నీ సిలుగున్ బ్రత్యక్షముగా గాదు ♦ దైవమ్ముదంగిన్

[అంత ప్రవేశము మాయామోహిని]

మాయా — ఆరెంటియొక్క సత్తా మాచుకొనియె నాపైకిఁ గత్తికట్టినవాఁడు. ఇప్పుడవి యూడినవి. కాని యింకా గర్వమూపలేదు. అంతియె కాదు సదానందా! మాటాడవేమి? సిగ్గాయేమి?

బకా — (స్వగతమున) అమ్మా! యిదే కాఁబోలు కట్టుబోతుది.

మోహి — (స్వగతమున) ఇదే కాఁబో లిదివఱలో సదానందునిచే వంచింపఁ బడిన మంత్రికత్తె.

సదా — (స్వగతమున) మఱల మన ప్రాణమునకు యముమూతవలె యీనాతి దాపరించిన దేమిపాపము. ఇప్పుడీ మాయలాడినుండి యేవలఁ బడుటెట్లు?

మాయా — సదానందా? యేమిటు యోచించుచుంటివి? "వత్తుసు లేమాట" మునలవాఁ డోసంగిన ప్రశ్నబలపము లేమైనవి? ఒక్కటేమాట విను?

ఉ. జీవములందు నాసోదవి ♦ చెన్నెఱభూమి సుఖింపఁ గల్గు నీ
కావిరి కోర్కెకల్గిన బ ♦ కావలి మోహినులన్ త్యజించి నా
కైవసమందు నుండుమటు ♦ గాదన క్రిద్దల కాకి మూఁకకు
నీవనజాక్షులన్ విను ము ♦ న్నెగ్గ వధించిట మేత చేయుదున్

సదా — (నిర్లక్ష్యముగా) హుంపోవే. నీవల్ల నేమగును? భగవానుఁడు నాముందట సేతులచ్చాపియున్న నటుల జఱుగును. నీవు నన్ను జాపుదానవు. నేను చచ్చువాఁడ ననుకొంటివా? ఛీ! యావలకు బొమ్ము. నాయెదుట నుండకుము.

మాయా — (తల పంకించి) ఆహా! యింకా చింతచచ్చినను పులుపు చావలేదనిన గతి నీవద్ద నున్న యంత్రతాయతు బలపము లివి పోయినను పౌరుషము గర్వము పోలేదు. వెనుకటివలెనే నిర్లక్ష్యముగా మాటాడుచుంటివి బహు జాగ్రత!

సదా — ఛీఛీ! నీది యొక బ్రతుకే. వయసు చచ్చినను నీయ్యాగము చావలేదను గతిగా నానిమిత్తమై కన్న జనకుని గంగపాల్జేసుకొన్నను నాపై వ్యామోహము మరల్చుకొనలేకుంటివి. పోపో! బానిస!

మాయా — మొదటినుండియు నీకీ పెంకితనమె యింతకు దెచ్చినది. నాసాత్త్వికతనము దానికిఁ గొంత తోడైనది. సరే యిఁక నేను కూడా నీయెడ కాఠిన్యము వహించెదను. ఇదే వినుము!

ఉ. ఇచ్చితి యొక్కగంట గడు ♦ విప్పుడు నీకు తదీయ మానసం
బచ్చుగ నాపయిం గొలిపి ♦ నమ్మలి (సేయని గాన నెంచి జీ

నేర్చుకు విన్నగించెవో! న♦ శేశ్వర! కానిడ నీదు స్త్రీలతోఁ
జచ్చెదవో తెగించి మను♦ జాల జ్వాలాగ్నిని గూలి చెల్వఁగాన్

బకావలీ! నాగపుర రాజతనయా! యీవిషయములో మీ ధర్మకుఁ దగిన సలహా చెప్పుడు. ఇదే నేనెడలి యొక్కగంటలోఁ దిరుగ పరి వ్యవసాన మరయుట కేతెంచెద.

(అని నిష్క్రమించును)

బకా—దేవా! వచ్చి వచ్చి యీ యంత్రజాలమను సుడిగుండములోఁ దగులు కొంటి మిదేమిపాపము?

మోహి—ప్రియా! దీనినుండి బయటఁ బడఁగలమా? లేక నిందు మునింగి హాత మగుదుమా?

సదా—చెలులారా! నే నేమిచేయఁగలను. ము న్నీప్రాంతమందు విడనాడిన మా దాసియగు వినోదవల్లి యేతెంచినచో నీవంత తృణప్రాయముగా దాఁటగలము.

[ప్రవేశము వినోదవల్లి]

వినో—(స్వగతమున) నా దివ్యదృష్టిని గని నట్లె సదానందుఁడు భార్యలతో శిలాకారము గొంది బాధపడుచున్నవాఁడు. (సమీపించి ప్రకాశముగా) రాజకుమారా! జ్ఞప్తి యున్నదా?

సదా—(పరుండియే) ఓహో! జ్ఞప్తి లే కేమి? నా దాసియగు వినోదవల్లివి గావా? ఆనాఁడు నీమాట వినక నిట్టి విపదాంబుధిని మునింగితిని. అరఘడియ క్రిందటనే నిన్ను దలంచితిని. నిన్ను విడచి సుమారు మాసము దినము లైనది. ఇంతవఱ కెచ్చట నుంటివి? తిరుగ నిప్పుడిట కెట్లు వచ్చితివి?

వినో—కుమారా! ఏనాఁ డటవిని నన్ను విడనాడి పోతివో యానాఁడె స్వర్గాధిపతి చెంతకు వెడలి నీచర్య లన్నియును దివ్యదృష్టిని కనుగొనుచుంటిని. ఇప్పటి కీ యవస్థ తటస్థించుటఁ జూచి దీనినిఁ దొలగించి యీ నాటకము ముగింప నిట కేతెంచితిని.

సదా—ఆనందమే కదా? కాని యాపని యెటులు?

వినో—ఇదిగో! యింద్రుని ప్రార్థించెద. అతనివలన మనకార్యము గట్టెక్కఁ గలదు. (చేతులు జోడించి ఆకసమువంకఁ జూచి)

దండకము. ఇంద్రా! దయాపూర్ణసాంద్రా! సదానందచంద్రా! సురేంద్రా! మహేం
ద్రా! అమర్త్యేంద్ర! దేవేంద్ర! బృందార కేంద్రా! మహేంద్రా! సదా,
నందు నాకంద సంద్రంబునం దెల్ప రాకల్ప! యీ యల్ప కార్యంబుకై వేగ
ప్రత్యక్షమై రాక్షసాకారియై యక్షిణీ కాంతయా మోహినిన్ బట్టి శిక్షించి
యీ దుర్మదిప్రక్ గారు రాదేవ దేవా! సుభావా! నమస్కారముల్
గొమ్ము రారమ్ము శక్రా! నమస్తే నమస్తే నమః.

[ప్రవేశము - ఇంద్రుఁడు]

ఇంద్రు—వినోదవల్లీ! నన్నేమిటికై ప్రార్థించితివి?

వినో—మహాత్మా! స్వర్గాధిపా! నీభక్తురాలై శిలారూపమును ధరించిన సదా నందు బకావలి మోహినులను రక్షించుటకై ప్రార్థించితిని.

ఇంద్రు—సరే! యిది నాపనియేకదా? ఇంక నుపేక్షించిన నాటకాంతమెట్లు కాఁగలదు? నీవీ వజ్రాయుధమును వీరికిఁ దాఁకింపుము. ఎప్పటట్ల వజ్రశరీరులై ప్రకాశింపఁగలరు. (అని వజ్రాయుధము నొసంగును)

వినో—చిత్తము. (అని తీసికొని సదానంద బకావలి మోహినులకుఁ దాఁకింప నెప్పటివలె నిలువంబడుదురు)

సదా, బకా, మోహి—మహాత్మా! యింద్రా!

కం. మాయామోహిని మంత్రో, పాయమునకుఁ జిక్కి బాధ ♦ పడగా మము నా
పాయమున సాకితివి స్వ, గ్గాయిక పదివేల వందనంబులు ♦ మీకుఁ

(అని ముగ్గురు నమస్కరింతురు)

ఇంద్రు—(ముగ్గురిని వీఁపు తట్టి) స్వస్తి! రాజా! స్వస్తి, బకావలీ! మోహినీ! మీకోర్కె ఫలించుఁగాక. వినోదవల్లీ! అల్లదే పుష్పకము. ఆనంద జగన్మోహనుల దోడ్కొని రమ్ము. నాటకాంతము కావలెను.

వినో—చిత్తము.

(అని నిష్క్రమింతురు)

బకా—(స్వగతమున) ఆహా! యీమహానీయుని హస్తస్పర్శనము వలన నాకు దివ్యజ్ఞాన మలవడినది.

మోహి—(స్వగతమున) ఓహో! ఈయన కరస్పర్శనము వలన పూర్వజ్ఞానము తెలిసినది. ఇదేమి చిత్రము.

సదా—(స్వగతమున) అయారే! ఈమహాత్ముని హస్తాంకుశమువలన మూఁడు తరములనాటి జన్మవృత్తాంతము తెలియవచ్చుచున్నయది.

ఇంద్రు—మీరలు యోచించుచున్న దేమిటి?

బకా—దేవా! యోచన కేమున్నది. ఇది మూఁడవ జన్మ యనియును మీయొక్క దాసిననియును ఇంక రెండు జన్మలకుగాని మిమ్ము చేరననియును విచారించుచుంటిని.

మోహి—దేవా! నేను సిద్ధే.

సదా—మహాత్మా! నే నుజ్జయినీ పురాధీశుఁడ నగు విక్రమార్కుఁడనని స్ఫురించుచున్నయది. నాకు నాలవదిగా నీనవజన్మ యేర్పడి యున్నయది.

(ప్రవేశము వినోదవల్లి ఆనంద. భువనమోహినులతో)

వినో—ఇంద్రా! మీయాజ్ఞపై యానంద భువనమోహినులను గొనివచ్చితిని. ఆనందదేవా! యీతఁ డమరనాయకుఁడు. ఈతఁడు నీకుమారుఁడు. వారలిద్దరు బకావలి మోహినీ సతులు. నీకోడండ్రు. అమ్మ యువరాణి ఈతఁడు నీభర్త. ఈవాఁడు నే వర్ణించిన వర్ణాంగియే యాబకావలి. వీక్షింపుము నేవచించినదానికి నీవు చూచినదానికి వ్యత్యాసమున్నదేమో

ఆనం—మహాత్మా! యింద్రా! పుత్రభిక్ష మొసంగినందులకుఁ బదివేల వందనంబులు.

(అని నమస్కరించును)

ఇంద్రుఁడు—రాజా! శుభమగుగాక.

సదా—తండ్రీ! వేనవేల నమస్కారములు.

(నమస్కరించును)

మోహి—బకా, మామా! పదివేలవందనములు

(నమస్కరించును)

ఆనం—కుమారా! రాజ్యభారము వహించి చిరంజీవివై యుండుము గాక. స్నుషలారా! శుభమగుగాక.

భువ—మహాత్మా! సఖా! ఇదే పదివేల వందనములు. నాతప్పు క్షమించి నన్ను మన్నించుము.

(అని పాదములపైఁబడి)

ఉ. చక్కఁదనంబు తెల్వియును ♦ సంపద లియ్యవి పొందియుంటకై
యెక్కట గొప్ప వంశమును ♦ నట్టిదియే బనిలే దిదన్ని యొం
చొక్కరి సొత్తుగాదు తలఁ ♦ పొక్కరి మించి మరొక్కరిమ్మహిన్
నెక్కని క్రొవ్వుమందురని ♦ నేఁడు తలంచి బిడెంబు వొందితిన్

సదా—చెలీ! ప్రసన్నుఁడనైతిని లెమ్ము. (అని లేవనెత్తును)

ఇంద్రుఁడు—సదానందా! ఆలిమగల మధ్య కలహమడ్డమై బెదరగింజ వైచినంత నేప్రకంటె యెక్కువ కాలము యుండదనుసామెత నాకిప్పుడు జ్ఞప్తికి వచ్చినదిసుమా

సదా—దేవా! దేవరకుఁ దెలియని సంగతు లేమున్నవి. అయినను జెప్పెదను.

తే. గీ. వారి లేకున్న లేదు సం ♦ సారమనని
వారియే ప్రాణముగావ క ♦ లారియగును
ఏరయ సుఖదుఃఖముల రంటి ♦ కాస్పదులగు
కాన పురుషులు స్త్రీలతో ♦ గప్పఁదగదు

[ప్రవేశము మాయామోహిని]

మాయా—(స్వగతమున ఆశ్చర్యముతో) ఆహా! యేమిది? నామంత్రప్రభావ మేమైనది? వీరలు నిజరూపము లెట్లు తలంచిరి. మద్గురువు నేఁడుగుడు కాన్పించుచుండిరే? ఈ యున్న పురుషుండెవఁడు? ఆశ్చర్యముగా నున్నయది. సమీపించిన సంగతి యంతయును తెల్లము కాఁగలదు. (సమీపించును)

సదా—మహేంద్రా! చూచితివా? అకట్టుబోతు దానిని, దానివలననే మాకిట్టి యిక్కట్టులు చేకూరినవి. ఇఁక దీనిని మాయెదుట గ్రుంచిన పాపము లేదు. స్త్రీహత్యాదోష ముండదు. ఓసీ మాయామోహిని.

వేంకటరమణవృత్తము

ఓసిపాపి! దుర్మదాంధ ♦ మోసమిట్లు చేయఁగా
దోషమేమి గా—మేము జేసినాము గా
మాకిదెవ్విఁ దాయి ♦ జేసి బాధనొంచుటల్
వానికగ్గమేల్—నీకు తోషమయ్యె చాల్
దానిగాడ్డ నిన్న వా క ♦ రాసికిప్పుడే యిటన్
జేసెదన్ బిరాన్—ప్రశ్నోగోపదన్ మరిన్
వాసవుండె యడ్డుగాక ♦ నీకుఁ దైవ నిల్పఁగా
కీసుదీస్తుగా—గ్రుంచి వేసి పోదు గా

(మీద కేఁగబోవ నింద్రుఁ డడ్డి నివారించి)

ఇంద్రు—ఓయీ! స్త్రీహత్యాపాతకమున కొడిగట్టకుము. సంగతి నే నరసెద ఓసీ! మాయామోహిని! యెందుల కిట్టి యకృత్య మాదరించితివి?

మాయా—ఏమని వచింతును, దేవా? చేసిన పాపము చెప్పఁబోవుదుఁగదా?

మంజరి. పలుచితి సాతని వలదని ద్రోయుట ♦ వాటమె బోటివరింపన్
పలుకరె పండితవరులిల పాపము ♦ పైదలి కోరిన వీడన్

మాయా—ఆర్యా! అకలంకప్రభా! ఏమేమీ? సర్వోత్కృష్ట ఉత్కృష్టజాతి స్త్రీనిగా బహిష్కరించుచుంటివా? అయ్యో! యిది యేమిపాపము. జాతిని బట్టి దూషించిన నేను కూడ మీతోఁ బాటు హిందువుల తెగలోఁ జేరినదాననే, ఒకానొకచో?

మ. హిందువుల పరిశుద్ధమందునను ♦ హిందువులు పోఁ[illegible] డి యుం
పొందుగా భుజియింపు వారిని ♦ మోదమెక్కుడ నంటి, నా
యందునన్ దిగఁగోసి కోపలె ♦ నన్ను మ్లేచ్ఛ[illegible] స్థానం
గంద దగ్గు స్వజాతి నాతిని ♦ వందనాగ్గులు భూవరా!

బకా—సురనాయకా! దివ్యజ్ఞాన మొసంగక జిజ్ఞాసలై వచ్చితి నీ వారికి మీరు దక్కు తక్కిన వారల ప్రత్యుత్తరమిచ్చుట యుక్తము కాదు తరువాతి విచిత్రము.

ఇంద్రు—బకావలీ! నీ కోరిక ప్రకారము మ్లేచ్ఛజనాళి చెప్పెద. (వజ్రాయుధము నెత్తి మాయామోహిని శిరమున నుంచి) ఓసీ! మాతృకల్పీ! నీకిప్పుడు ఒక్క నాపల్లి నవా బేవర్ణస్థునిగా గాన్పించుచున్నవాఁడు.

మాయా—మహాత్మా! జాతు లన్నిటిలోని కత్యుత్తమమైన హిందుప్రజాతిలో నగ్రగణ్యమైన బ్రాహ్మణవంశీకుఁడుగా గాన్పించుచున్నవాఁడు.

ఇంద్రు—ఇంకా నీకేమి కాన్పించుచున్నయది.

మాయా—దేవా! అతఁడు కాశినుండి గంగను గొని రామేశ్వర మేగి శ్రీరామలింగేశ్వరున కభిషేకించునట్లు గాన్పించుచున్నయది?

ఇంద్రు—ఎన్నిసార్లు?

మాయా—ఏడుసార్లు

ఇంద్రు—తరువాత

మాయా—ఆహా! అతనికి రామలింగస్వామి కాఁచో లీలగా గన్పట్టుచున్నవాఁడు

సీ. సగమేను స్త్రీత్వము ♦ సగమేను పురుషత్వ, మొప్పనౌ దలదాఁటి ♦ యొప్పుచుండ
నొకచేత శూలంబు ♦ నొకచేఁ గపాలంబు, మెలయు ఫణితతిమై ♦ చెలఁగుచుండ
గళమెన్న నీలమ్మై ♦ కచపంక్తి రక్తిమై, యముఁ జర్మము మేన ♦ నమరుచుండ
ఒడలంత రత్నమ్మై ♦ మెడను రుద్రాక్షలై, మొలయు మాక్కుంటిచే ♦ మెలఁగుచుండ

తే. గీ. వృషభవాహనా రూఢుఁడై ♦ నృపవరుని
కెదుట నిలుచి మది మెచ్చి ♦ లేమి నలరె

ఇంద్రుడు — ఇదే. కట్టుకోతువా నావా? కట్టిక తప్పి మిట్టిపడుము పుట్టుపూర్వోత్తర
మెఱుంగక దట్టి దిర్భాగ్యపు శాపము లభమయుంటివి. స్త్రీజన్మ మెత్తలేదా? ఇదిగో
నీజన్మమును స్త్రీత్వ మొందుము.

(అని జాతరూపమును శిరమున నుంచును)

మాయా — ఆహా! తారకాపురప్రభూ!

కం. తేజోపసన్ ధరాధిప, నీజతివిడి క్రిందజనని ♦ శీలము మరల
నే జరియించితి పాపపు, నైజముచేత శపియింప ♦ నాకపతి సఖా!

(సదానందునితో) ఓయీ! సదానందా! క్రిందటిజన్మలో నేనుగా తేజోపసన్ బకావళి నాటకపాత్రము యందు నిష్ఫలసందర్భ నేను మోహావళినై జన్మించితిమి. అప్పుడు నీకదే ముప్పనొందితి నిన్నొడిచా యనుగ్రహించి ఏయుప్పులుతప్పగా దప్పక నాడకింపరాదా?

సదా — ఏ! సిగ్గులేనిదానా? పూర్వజన్మ మువాసనగలుగగా నాకే కలతరింపమంటివా? నన్ను పెట్టిన బాధలు మఱచితివా?

పంచ. వృషుండు భూమనుబంధు నెంత ♦ సేవసించి యుండగా
నిన్నీ! కులాము! లజ్జలేక ♦ నీకటిక్ దడింబడక్
నిషాగ విస్ఫుల్రొండి కల్లు ♦ నెల్లఁ ద్రావి వైపుచే
బాసంతు రన్నమాట లేక ♦ నాటఁ ద్రుంగ పాపమా

(అని ఖడ్గముతో కొట్టి మోహావళి నేల మ్రగ్గఁబడును)

ఇంద్రు — సదానందా! చాలుఁజాలు. సంగీతబకావళియందలి నా శాపముచే నీకీలోపము రాగలందుల కాపాపిని పారి విగ్గులేక నానిచది. అంతే కాని వేఱు కాదు. మాయామోహినీ! ముందు రాబోవు సంగీతబకావళి నాటకమునందు సదానంద, బకావళి మోహిని, జగన్మోహిని, వినోదవల్లి, తిరుగ జన్మించెదరు. ధర్మబకావళియందు గాని వీరల శాపము పూర్తికాదు. అందుచే వీరితోఁబాటు నీవుగూడ కష్టపడవలెను. సంగీతబకావలిలో నీభర్త తేజోపసన్ భూలోకమున జన్మించి సదానందుని కకారణ ప్రేమ కలవాఁడై యాతనివలన నీతోఁ జెల్మిపొంది సుఖింపఁగలుగును. అంతవఱకు నీది యుండుము.

అవం — మహాత్మా! యింద్రా! వీరందఱవరు? ఎందులకీ శాపము వీరికి కల్గినది.

ఇంద్రు — రాజా వినుము. (ఒక్కొక్కరిని చూపును)

తే. గీ. కిరీట మొక సరాసరిగ నే ♦ తికమకగొన
కరిదియౌ రాజబాటను ♦ సరణిఁబట్టి
నడుచు నెంతకాలముకైన ♦ చెడక నిదియె
రాజ్యచక్రంబు నడిపించు ♦ రహి వెలుంగు

ఇదియే యిందలి పరమరహస్యము. నాశిరమునున్న కిరీటము నీ శిరమున నునిచెద, హాయి చక్కగా రాజ్య మేలుకొనుము. (అని కిరీటమును సదానందుని శిరమున నునిచి) అమ్మయ్య! యిప్పటికి నాతల మిగుల తేలికగా నున్నయది. పుట్టెడు బరువు తగ్గినటు న్నది. (అని తల తడుముకొనును)

ఇంద్రు—నవ్వి, ఇఁక తపోధన మార్జించి పుణ్యమును బడయుము.

అనం—చిత్తము.

ఘృతా—స్వర్గాధిపా! నమస్కారము. జనకా! వందనము.
(అని నమస్కరించును)

ఇంద్రు—స్వస్తి. మీ కేమివలయునో కోరుకొనుఁడు.

అనం—దీర్ఘాయురస్తు.

మోహి, బకా, జగ—సురనాయకా!

బృందారకులకెల్ల ♦ మందిరంబైన నా, కంబు విడిచి చాల ♦ కాలమయ్యె
నందనమునుగూర్చె ♦ డానందనమున షి, కాగొనరిచి చాల ♦ కాలమయ్యె
వజ్రి! తాము వసించు ♦ వైజయంతముపొడ, గాంచి నేటికిఁ జాల ♦ కాలమయ్యె
అరయ కోర్కె లొసంగు ♦ నైరావతము కల్ప, కంబును గని చాల ♦ కాలమయ్యె
స్వర్ణదీయందున ♦ సఖులతో జలకంబు, లేలాడు టది చాల ♦ కాలమయ్యె
మేరు నగంబున ♦ మీతోడ గేలితో, గడపి కాలము చాల ♦ కాలమయ్యె
దేవతా సభయందు ♦ గావించి నృత్యంబు, హాళిఁగొలిపి చాల ♦ కాలమయ్యె
వ్యోమయానంబుపై ♦ నామోదమున తిరు, గాడి మీతోఁ జాల ♦ కాలమయ్యె

ఆ. వె. మంజుఘోష ధాన్య ♦ మాలి ఘృతాచి తి
లోత్తమల సుకేశి ♦ నుత్తమాది
యమఁగు చెలులతో స ♦ యాట లాడుకొనుట
చాల కాలమయ్యె ♦ స్వర్గనాథ!

కావున నివియన్నియును మాకిప్పుడొక్కసారి చేఁగూర్ప గలందులకుఁ బ్రార్థించు తము.

ఇంద్రు—చెలులారా! వీరలో [illegible] బకావలియందు దీర్చెదను. వందా నీకేమి వలయునో గోరుము.

సదా—మహాత్మా! నాకేమి వల[illegible] మ్లేచ్ఛకన్యను బెండ్లియ త్తిననే తప్పు లేకుండగ నుండునట్లుగా:—

ఉ. అందుగ సౌఖ్య సంపదకు ♦ నాకమె[illegible]పై సదా
నందము గూర్చుచుం బ్రజల ♦ కక్క[illegible] కల్పకంబవై
హైందవ రాజ్యలక్ష్మి యిటు ♦ లాగుచు [illegible] జాతి వైరముల్
హైందవ మ్లేచ్ఛ సంఘముల ♦ కద్భుత [illegible] జేయుతన్

ఇంద్రు—తథాస్తు. తథాస్తు. తథాస్తు.

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల చరణారవింద మరంద తుందిలేందిందిరాయమాన మాన సోదారైనాపురాన్వయ క్షీర నీరాకర రాకా సుధాకర బాపనార్య పౌత్ర సోమరాట్పుత్ర భారద్వాజ సగోత్ర పవిత్ర కాత్యాయనీసూత్ర విచిత్ర సుందరాంబాగర్భ శుక్తి ముక్తాఫల విబుధజన విధేయ సుందర రామయ నామధేయ ప్రణీతంబైన బంగన్ బకావలి నాటక రాజంబున పంచమాంకము సమాప్తము

